Approved by the Text-Book Committee, for class-use. Andhra Gazette, dated 5-5-55, Page No. 13; Madras, Fort St. George Gazette, dated 9-4-58 Page 14

# విజయతోరణము

## (చరిత్రాత్మక కథలు)

గ్రంథకర్త:

విద్వాన్ శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు




ప్రకాశకులు:

బాలసరస్వతీబుక్ డిపో, (రిజిష్టర్డు)

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

కర్నూలు.

బ్రాంచి ఆఫీసు: 6 సుంకురామశెట్టి వీధి, మద్రాసు-1

కాపీరైటు రిజిష్టర్డు] 1958 [వెల 1-0-0

# తొలిపలుకు

ఈ గ్రంథమున నా రచించిన కథలు రెండు. రెండుగూడ విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించినవే.

మొదటిది 'దేవరాయల చరిత్ర'. ఈ గాథ చారిత్రకులదృష్టి నింత దనుక ఆకర్షింపనే లేదు. 'పల్లెపాటలలో జీవము నిల్పికొను' చున్నది. 'తందానతాన' పాటల వారు మాత్రము 'దేవరాయ'ని బ్రహ్మాండముగఁ జెప్పెదరు. విద్యానగర చరిత్రపై—ననేక పరిశోధనలు చేసిన—చేయుచున్న పరిశోధకులు 'దేవరాయ'ని వైపు దృష్టి మరలింపకుండుట గొప్ప విచిత్రము.

రెండవ గాథ, 'జీర్ణకర్ణాట ప్రతిష్ఠాపనాచార్యుఁడు' 'రామరాయల'ది. అతఁడు సాహిత్య సంగీతములకు—సామ్రాజ్యమునకుఁ గావించిన సేవ జగద్విదితము. ఆ నిష్కామయోగి త్యాగవైభవమును సముచితముగఁ జిత్రించితిని.

పద్య రచనకంటెను గద్యశిల్పము కష్టతరమని సాహితీవేత్త లందురు. 'తెనుఁగుదనమును బోషించుట'—స్వల్పవాక్యముల రచించుట యీ గ్రంథములోని ప్రత్యేకత.

విద్యాశాఖాధికారులు నా యీ ప్రయత్నమును మన్నించి ప్రోత్సహింతురని యాశింతును.

ఇట్లు,

పుట్టపర్తి నారాయణాచార్యులు.

# విషయసూచిక







# దేవరాయఁడు

దక్షిణమున విజయనగర సామ్రాజ్య మేర్పడని నాఁటి విషయము. ఆ నాఁటికే 'పెనుగొండ' మహా ప్రసిద్ధము. దానిని ఘనగిరి యనియు, సురగిరి యనియుఁ బిలుచుచుండిరి. అది స్థలదుర్గము. దానిని దొలుతఁ బల్లవులు పాలించిరి బాణరాజు లేలిరి. ఈ బాణరాజులకు 'బరిగి' ముఖ్యపట్టణముగ నుండెను. బాణరాజు లేలిననాఁట 'ఘనగిరి' యమిత వైభవము గనెను. బాణుల తర్వాత హొయసలులకు 'ఘనగిరి' గడీదేశమయినది. మూఁడవ వీర బళ్ళాళుని కాలమునఁ బెనుగొండకు నాయకుఁ డళియ మాచయ్య. అతఁడు విక్రమసముద్దండమూర్తి. సవ్యసాచివలెఁ జోళులను, పాండ్యులను దనకు భయపడఁజేసి హొయసలుల విక్రమమునకు మెఱుఁగులు దిద్దుచుండెను. ఇంతలో దక్షిణదేశ చరిత్రలో నొక భూకంప మేర్పడినది. ఉత్తరమునుండి వింధ్యాద్రి కీవలనున్న బంగారమునుగుఱించి విన్న మహమ్మదీయులు దక్షిణమువైపు మఱలినారు. వారి తళ్లునకు భయపడి, యెందుకైనను మంచిదని వీరబళ్ళాళుఁడు రత్నస్థగితమగు

తన సింహాసనమును 'ఘనగిరి' కంపినాఁడు. దాని వెంటనే కొన్ని బండ్లపై బంగారును, రత్నములును బంపఁబడినవి. అళియమాచయ్యా యాధనసంచయము నంతను పెనుకొండ లోని పర్వతగుహాలలో దాఁచివేసినాఁడు. వీరబళ్ళాళుఁడును, అళియమాచయ్యాయు మహమ్మదీయులతోడి యుద్ధమున వీరస్వర్గము నలంకరించిరి.

హొయసలుఁల రాజ్యము పాడయినంతనే యనేక మేధావులకు హిందూధర్మస్థాపనము ప్రధాన సమస్యయయి నది. ఆ సమయముననే యపరశంకరుఁడు, విద్యారణ్యులు పెనుగొండ పట్టణమునం దుండిరి. ఆతనినిగూడ నీ సమస్య గలఁచినది. పండ్రెండు సంవత్సరములుగాఁ గఠోరదీక్షతోఁ దప మాచరించుచుండిన విద్యారణ్యులకు మహాలక్ష్మిదరిసెన మిచ్చి సాభాగ్యవర్షమునే కురిసినది. ఆ సౌభాగ్యముతో విద్యారణ్యులు 'హక్కుఁడు, బుక్కుఁడు' అను నిరువుర సహా యమున నూత్న సామ్రాజ్య ప్రతిష్ఠాపనము గావించిరి. వారిద్దఱిలోఁ బెద్దవాఁడగు హరిహరరాయలు సింహాసనము నధిష్ఠించెను. అప్పుడు విద్యారణ్యులు 'పెనుగొండ' యందు హొయ్సలులు దాఁచియుంచిన ధనమునుగూడఁ దెచ్చి హరి హరరాయని వశము గావించిరి. ఆ సామ్రాజ్యము అమోఘ ముగ రెండున్నర శతాబ్దములపాటు దక్షిణాపథమునంతయుఁ దన బాహుచ్ఛాయలలోఁ గాపాడినది.

విజయనగర సామ్రాజ్యకాలమునను 'ఘనగిరి' తన ప్రాధాన్యమును గోలుపోలేదు. అది వారికి వసంతమందిర

ముగ నుండినది. తుళువవంశమును, నారవీటివంశమును విద్యానగరము నధిష్ఠించినపుడు దానికిఁ బట్టిన యదృష్ట మింకను గొప్పది. విద్యానగరపతనానంతరము వారి సామ్రాజ్యమున కదియే రాజధానియు నయినది.

ఒకానొక సమయమున ఘనగిరి ప్రాంతములను దేవరాయ లనునాతఁడు పరిపాలించుచుండెను. ఈ దేవరాయలే కాలమువాఁడో చరిత్రయం దింకను దేలలేదు. అట్లే యాతఁడు స్వతంత్రుఁడో ఒక మండలేశ్వరుఁడో కూడ మన మెఱుఁగము.

ఈతనిని గుఱించిన గాథ యింకను "పల్లెపాటలలోనే ప్రాణము బోసికొనుచున్నది."

దేవరాయలు ధర్మనిష్ఠుఁడు. ప్రజ లాతని బిడ్డలు. తండ్రిలేనివారు జనకుఁడాతఁ డనిరి. తల్లి లేనివారు మాతృస్వరూపముగా దేవరాయలం జూచిరి. ధర్మమునకు విరుద్ధములుగాని ప్రజల కోరికలన్నియు నాతఁడు తీర్చుచుండినాఁడు. ఆనాఁటి లక్ష్మి భారతమున మఱియెన్నఁడును లేదు.

ఆ జనులు దారిద్ర్యమే యెఱుఁగరు. ఒక తమలపాకు లమ్మెడివనిత దనయొడలిపై గలసొమ్ములొసఁగినచో నాధనముతో పోర్చుగీసుదేశమునంతయుఁ గొనవచ్చునని యా సంపాదనుగాంచిన విదేశ రాయబారులు వ్రాసినారు.

ఆ ప్రజకు కళాతపస్సు జీవనము. వా రన్నము లేక జీవింతురు. కళాభిమానము లేక బ్రదికెడివారు గారు. వారి నిత్యజీవితమే కళామయముగా నుండెడిది. ముగ్గులు దీర్చ

టొక కళ. మొగముల సిందూరమును ధరించు టొక కళ. పాదములయందు పారాణి నలదుట యొక కళ.

దేవరాయల కెంతకాలమునకు సంతానము కలుగ లేదు. సంతానమునకై యాత డెన్నియో పుణ్యకార్యముల నొనరించినాడు. మేరుశృంగ తులాపురుషాది దానములను గావించెను. అశ్వత్థ ప్రతిష్ఠలు గావించినాడు. నాగులకు బూజ గావించినాడు. దివ్య క్షేత్రముల దర్శించి, యందు నర్చావతారములకు నిత్యనైవేద్యాదుల నేర్పాటు గావించెను. వృద్ధులు, ధర్మానుబంధజీవనులు. భూలోక దేవతలు నగు విప్రులచే నెన్నియో పురాణముల చెప్పించికొని వినెను.

దేవరాయని భార్య రత్నమ్మ. ఆమె చేసిన వ్రతములకంతులేదు. ప్రదక్షిణములు గావించిన అశ్వత్థములకు మితిలేదు. క్రుంకిన పుణ్యతీర్థములకు బరిమితి లేదు. ఎరుక సానులచే నామె గద్దెలు చెప్పించి వినెను. పరస్పరము ప్రేమాకృష్టహృదయులై పార్వతీ పరమేశ్వరుల బోలు వృద్ధ దంపతులకు బూజలు గావించినది. ఎన్నివిధముల సేవించినను దేవతలకు దయగలుగలేదు. తనయనంతరము సింహాసనాధికార మంతరించునేమో యనుభయము దేవరాయల హృదయము నాక్రమించినది. "పూర్ణచంద్రునివంటి సుతుని ముఖమును విలోకించి, మురియు భాగ్యమంటలేదే" యని రత్నమ్మ పొట్టు పొర్లగుచుండినది.

కాలక్రమమున సంతానము లేని దుఃఖము దేవరాయలహృదయమునం బూర్ణముగ నాక్రమించెను. హాయా

రూఢుడై ఘనగిరివీథులయందుఁ బోవుచున్నపుడే చిన్న బిడ్డఁడెదురైన నాతని కన్నులు తుషారపిహితప్రాభాత పద్మము లయ్యెడివి. చిన్నపిల్లలు ముగ్ధ మధురముగ నాడు మాటలను విన్నపుడు దేవరాయనికిఁ గడుపులోఁ జేతులు వెట్టి త్రిప్పినటులుండుచుండెను. పాప మతఁడేమి సేయును! నిరాశాహతుఁడైన రా జితరులు గన్నబిడ్డల నెత్తిముద్దాడు చుండెను. ఆ పిల్లలరమణీయములగు నలకలఁ దాకుచున్నపు డాతని కేదియో యనిర్వచనీయమగు నానంద మయ్యెడిది. వెంటనే యా పిల్లలు దనవారుగా రను స్మృతి దట్టెడిది. ఆవలపు శాకుపోటువలె గ్రుచ్చుకొనును. ఏపని జేయుటకునుఁ దోచదు. మంత్రులు మొదలగువారందరికి నిది తీవ్ర విషాద కారణమైనది. కాని వారేమి సేయుదురు? సంతానము దైవ దత్తము. దైవములను సంతోషపరచు కార్యము లన్నియు రాజు గావించెను. అతఁడు సేసినది చాలక - యాతని సంతానప్రాప్తికై మంత్రులు ననేక క్షేత్రములకు దానా దుల నొసఁగిరి. మండలేశ్వరులు, దళవాయులు నందఱును దమ శక్తికొలఁది రాజునకు సంతానప్రాప్తికై వ్రతాది పుణ్యకార్యము లొనరించిరి. వారి కార్యము లన్నియు బూడిదఁబోసిన పన్నీరైనది. దైవమునకుఁ దయబుట్టనపుడు మానవుఁడేమి జేయగలడు?

మంత్రు లెంతయో యాలోచించి యొక నిర్ణయమునకు వచ్చిరి. మహారాజును వేఱొక వివాహమునకై ప్రోత్సహింపవలెను. కాని యీ విషయము నాతనితో విన్న

వించు ధైర్య మెవ్వరికి? దేవరాయల కష్టమంత్రు లుండిరి. అతనికే కాదు-ఆ కాలమున ప్రతి రాజునకు - చివరిపక్షము- ఎనిమిది మంత్రు లుండెడి వారు. ఆ యెనమండుగురును ఎనిమిదిశాఖలను విచారించుకొనుచుందురు. రెండు మూఁడు సంవత్సరముల కొకసారి దమ శాఖలయందే వారు పరస్పరము మార్చుకొనుచుందురు. అనఁగా నందఱు మంత్రులకును అన్ని శాఖలయందలి విషయములును బాగుగాఁ బరిక్షుణ్ణములై యుండవలె నన్నమాట. ఈ యెనమండుగురియందును జ్ఞానవృద్ధుఁడును వయోవృద్ధుఁడు నగు నొకఁడు ప్రధానామాత్యుఁడై యుండును. కొన్నియెడల నీ ప్రధానామాత్యపదవి వంశానుగత మగుటయు గలదు. ఒకచో వృత్తి వంశమున కనుస్యూతముగా వచ్చినపుడు వ్యక్తులకా వృత్తులందుఁ జాతుర్య మలవడునని వారు నమ్మిరి.

ఆ మంత్రులు ప్రజల గౌరవమునకును, ప్రేమకును పాత్రులై యుండిరి. తమ సుఖముకన్నను ప్రజలసుఖమును ప్రధానముగా నాలోచించెడివారు. దైవముకన్నను ముందు దేశమును బూజించెడివారు. ఆర్ష ఋషుల మంత్రాక్షరములు పండిన భారతభూమి చండీదేవి యవతారమను విశ్వాసము వారి నరనరమునం దాక్రమించి యుండెడిది.

**శాకుంతలము :**

దేవరాయలు నిండుకొలువు దీరియున్నాఁడు. ఒకవైపు మహామండలేశ్వరులును, మండలేశ్వరులును బారులుదీరి

నిలిచియుండిరి. వీరందరును రాజకీయోద్యోగులు. వీరి కెదురుగా నాయకులు, నాయకాచార్యులు సాలవృక్షముల వలె బారులుదీరియున్నారు. వీరందఱు సైనికోద్యోగులు. వారి తివారిపు చుంగులు మందమారుత తాండోళనములకు రెపరెపలాడుచుండెను. రాజున కెట్టయెదుట హేమరసచిత్రితములైన సింహాసనములున్నవి. వానిపై విదేశీయులగు రాయబారు లధివసించియున్నారు. రాయల కిరువైపుల నష్ట మంత్రుల కున్నతాసనములు అమర్పబడియుండెను. మహామంత్రులకు దేవరాయల కుడివైపున నొక యాసనమున్నది. అదియంతయు బంగారు తగడులతో గప్పబడియుండెను. ఆ తగడులపై నిగనిగని వజ్రములు దమకాంతులతో బట్టపగలును సృష్టించుచున్నవి. దేవరాయలది రత్నసింహాసనము. తుంగవిశాలితము. దానిపై నెక్కుటకు మూడు సోపానములమర్పబడినవి. ఆ మూడును హేమమయములే. రాజుగారి సింహాసనముపై శ్వేతచ్ఛత్రమున్నది. దాని జాలరులకు గుబ్బముత్యాలు గూర్పబడినవి. ఆ ముత్యముల కాంతులు, సింహాసన రత్నకాంతులును శబలితములై అదియొక వింత సొబగును గల్పించినవి. దేవరాయలు దన డాకాలియందు గండపెండేరమును ధరించినాడు. దానియందు వైరిభూభుజుల తలలుజిత్రింపబడినవి. వారందఱును దేవరాయ ఖడ్గవిదారిత దేహులు – ఉత్తమ క్షత్రియులు. ఆ కాలమున నిర్జితుల మస్తములను డాకాలి పెండేరమున మలిపించుట విక్రమధనులైన రాజుల కాచారము. రాజునకు వెనుక ప్రక్క

నిరువురు నవయౌవనాంగులు చామరములువేయుచున్నారు. ఆ చామరములు మానసౌక సితపక్ష సపక్షములు. సజ్జన హృదయ వళక్షములు. ఆ చామరగ్రాహిణుల సౌందర్యము వర్ణనాతీతము, వారు పుడమికి దిగివచ్చిన యచ్చరలవలె నుండిరి. యంత్ర పాంచాలికల వలె నుండిరి. సుకవి కల్పిత భావనాచిత్రముల వలె నుండిరి. వారి మందహాసములు రతనముల కాంతుల కన్నను మిన్నలై, సభామంటపమున జిగజిగ వెలిగించినవి. దేవరాయల కొక వైపున నొకసుందరి ఖడ్గముబట్టి నిలిచియున్నది. వేరొకవైపున తాంబూలకరండ వాహినియున్నది. నరపతికి మ్రోల కొంచెమోరగా కళాచి కను బట్టుకొని యొక కలాపికలాపకుంతల యుండెను. వారందరును గర్ణాటాంగనలేయని కర్ణహాటకరత్న తాటంక యుగధాళధళ్యములు వెల్లడించుచున్నవి. రాయల కెదుటి వైపున రమణీయములగు రత్నకంబళములపై నొయ్యారముల గనులు - ఉవిదలున్నారు. వారందరు గగనతలము నుండి యూడిపడిన నక్షత్రములు. రాయలకొలువునందున్న వేశ్యాంగనలు. ఈ భోగినీకాంతలకు వెనుకల - నేలపై మదద్విరదాకారులు- సింహసంహనన మూర్తులు - మల్లురు కూర్చొనియున్నారు. వారి చూపులయందు మృత్యువు క్రీడించుచున్నది. వారి కఠినతర బాహువులు - మృత్యుదేవీ లీలోపధానములై యుండినవి.

మహారాజున కల్లంతదూరమున "కడితములు" పట్టుకొని కరణములు నిలిచియున్నారు. ఒకవైపున వీరిలో

నాడువారును నుండిరి. అంతఃపురమునకు సంబంధించిన ఖర్చులను-ఆదాయములను దేల్చి చెప్పునది యాడువారే.

మహారాజుల కెదురుగా గొంతదూరమున శశాంక ధవళములైన దెరలు వ్రేలుచున్నవి. వాని వెనుకల పాదవలయము లప్పుడప్పుడు స్వనించుచుండెను. వారాదినపు నాట్యమునకు నియుక్తలైన నీరేజముఖులు. రాజునకు వెనుక గొన్ని దెరలు వ్రేలాడుచున్నవి. వానికవ్వల నప్పు డప్పుడు గుసగుసలు. ఆ గుసగుసలు రాణివాసపు స్త్రీలవి.

రాజునకు దొలుత వందిమాగధులు వినయపూర్వక ముగా నమస్కరించిరి. వారి వెనుక మహామండలేశ్వరులు ఒకరొకరు వచ్చి భూపాలుని పాదములను దాకిరి. వారు దేవరాయల పాదములను దాకునపు డెదుట కృపాణహస్తులై నిలుచున్న మాగధులు వారిని రాజున కెరుకపరచుచుండిరి. అప్పుడు నరపాలుడు చిఱునవ్వు నవ్వును. ఆ నవ్వులు మల్లెల దండలై యవనత శిరోధులగు మండలేశ్వరులపైఁబడును. ఆ తరువాత నాయకాచార్యులును, నాయకులును వినయ మున నమస్కరించిరి. వారు దీర్ఘతనులు. విశాల రక్త నేత్రులు. రణఖర్జూభరితదోఃపరిఘులు. గాఢగర్వనటీనాట్య రంగాయిత వికటభ్రుకుటీఫాలభాగులు. ఆ సైన్యాధి పతులు నమస్కరించుచున్నపుడు క్షత్ర జాతి విక్రమమే రాజునకు నమస్కరించుచున్నటు లుండినది.

ఇంతలో నెదుట నున్న తెరలలో గజ్జెలు గదలినవి. ఆ ధ్వనులు సంగీత సముద్రమున దరంగములవలె నుండెను.

వాని కనుగుణముగా వర్షాకాలఘనగర్జామంథర ధీరముగా మృదంగములు శబ్దింప నారంభించినవి. తదనుగుణముగా హాల్లకులు మ్రోగినవి. ఆధారషడ్జమును నందుకొని చెవులు గింగురుమనునట్లు నాలుగైదు తంజాపురితంబురలు ధ్వనించుచుండెను. సభయంతయు నిశ్శబ్దమయ్యెను.

తిరస్కరణి వెనుకనుండి క్షీరసముద్ర తరంగముల దాసివచ్చు మహాలక్ష్మివలె నొక తరుణీమణి నాట్య మాడుచు నంజలిబట్టి ముందునకు వచ్చినది. ఆమె చేత బూవులుండెను. నాట్యమాడుచునే యామె దనకరమున నున్న కుసుమములను సభికులపై విరజిమ్మినది. ఆ పూవులు స్వభావ సౌరభ్యసంభరితములే కాక యితర వాసనాద్రవ్యములతో నాన్పఁబడియుండినవి. అవి హఠాత్తుగఁ దెల్లని తుమ్మెదలై సభ్యులపై బడినవి. అవి పడెనో లేదో కొలువుకూటమంతయు వాసనలే వాసనలు. వారి తనువులన్నిట బులకలే పులకలు.

ఆమె నాట్యారంభమున పతాకహస్తమును బట్టెను. నాటి కథావస్తువు అభిజ్ఞాన శాకుంతలము. దుష్యంతవేషమును ధరించిన సుందరాంగి గడుంగడు మనోహరముగా నభియించినది. కణ్వుడు, ననసూయ ప్రియంవద మొదలైన యన్ని భూమికలును తరుణీమణులే ధరియించిరి కంఠధ్వనియు, నర్తనాకౌశల్యమును బాత్రానుగుణమై యుండెను. పురుషభూమికలు ధరించిన బూబోడు లచ్చపు మగవారివలెనే మెలఁగిరి. నాటకమునం దంతయు నొక్క

మాటలేదు. అన్ని భావములను హస్తములతో, నేత్రచాలనములతో, దనువల్లీమందచాలనములతో, విలాస వక్రీకృత భంగిమలతో బ్రదర్శించిరి.

కంఠమున నా యువతులు గానమును గావించిరి. ఆ గానమునందలి యర్థమును గరముద్రికలతో మధుర చేష్టముగఁ జూపిరి. ఆ యర్థములోని భావమును వారి గనుబొమ్మలు - ఒకసారి వక్రములై, ఒకసారి దీర్ఘములై, ధనుర్లతలై, శోభితమాలతులై, సుందరకఠిన ములై కీసతిప్పకుండఁజూపెను. పాదములు పాటయందలి లయను-నాలుపోగంటి ఛేదము లేక జూపించినవి. ఆ తాళము లెన్నిగతులనో మారుచుండెను. మద్దెలకాంద్రు బలికించు జతులన్నియు నా యువతులయందు స్పష్టముగ నోటఁబలికి నట్లు వినవచ్చుచుండినవి.

దుష్యంతునిచే నిరాకృతయైన శకుంతల గావించు దీనాలాపములకు రాలు గరిగిపోయినవి. ఆమె కాంభోజి రాగమున పాటపాడుచు నభినయము గావించెను. ఆ యభినయము భావానుగుణమై యుండినది. ఆ చేతులు దీనభావమును సూచించుచు నెండలో నరటియాకులవలె కలలయందలి భావములవలె మెదల నారంభించినవి.

ఆ తరువాత - మారీచాశ్రమమున దుష్యంతుఁడు శకుంతలను జూచుట బ్రధానఘట్టము. భరతుఁడైదారేండ్ల బాలుఁడు. వాడు దన జంకయందు సింహపుఁ బిల్లను ధరించి యుండెను. వానినిఁ జూచినపుడు దుష్యంతుని మనమునందు

దీర్చరాని బాధ. ఈ భావప్రకటనయంతయు-నాట్యము మొదటి నుండియు నాంగికాభినయముతోడనే సాగుచున్నను-నా నటనము శబ్దోచ్చారణమున కన్నను స్పష్టముగ నున్నది.

ప్రధానామాత్యులు నాట్యమును వీక్షించుచున్న దేవరాజు వైపుజూచిరి. రాజుకన్ను లతి విశాలములు. శతపత్రములకును, వానికి నే భేదము లేకుండెడిది. ఆ కన్నులనుండి నీరేకధారగాఁ గారుచున్నది. రాజు నుమ్మలికమును గమనించిన మహామాత్యులెవ్వరికి సైగ యొనర్చిరో - వారెట్టులాయర్థము నాకళించుకొనిరో - నాట్యరంగములోనికి నభినయ మాపవలసినదని యాజ్ఞ పోయినది. అంతవఱకును దనువు మఱచి పాడుచున్నటు లున్న వీణలు దమకుఁ దంత్రులే లేనట్లు మరుక్షణమునకే మూగవైపోయినవి. తంబూరలు దమనాదమును-సాలీడులు దమదారమునువలె - స్వహృదయమందే దాచికొనెను. దేవలోకమునుండి వలసవచ్చిన యచ్చరలవలె నింతవరకు మానవ నయనములకుఁ గృతార్థత్వము నాపాదించిన బుత్తడిబొమ్మలు-బిత్తరులు గ్రుక్కుమిక్కుమనక ప్రతిసీరల వెనుక దాగుకొనిరి. ఆ దాగికొనుట - జన్మాంతరవాసన లాకానొక సమయమున - కొన్ని సాజాత్యానుభావానుభవ భూతితో బహిరుద్గతములై, మఱల విస్మృతిపథమున దాగికొనునటులుండెను.

మహారాజులు దిన్నగా ధర్మాసనమునుండి లేచినారు. ఆ లేచుట నిట్టూరుపులే లేచినటులుండెను. వారి వెంటనే

యమాత్యగణమంతయు దమ తమ యాసనములనుండి లేచిరి. నిరాకృత దీనభావమువలె నలసాలసముగ మహారాజులు నడచివెళ్ళినారు. వారివెంటనే యమాత్యులును వెళ్ళిరి. సభయంతయు వింజ మూకికి నటులైనది. ఆ దినమున దమకేమి యాపద మూడునో యని భరతాచార్యులకు నిజముగ భయమే యయ్యెను.

రంగాదేవి :

అది రహస్యమందిరము. దాని చుట్టుప్రక్కల ద్వార ద్వారమున నిలిచి కావలివారు సహస్ర నయనులై కావలి గాయుచుండిరి. లోపల మాటలాడుకొనునపుడు సవ్వడిగూడ బయటికి వినవచ్చుటలేదు. ఆ భవన నిర్మాణ మట్లుండెను. అది రాత్రి.

భవనమున నక్కడక్కడ గాజు దీపములు వ్రేలాడు చుండెను. ఆ కాచపాత్రలనేకవర్ణముల నుండెనవి. వాని యందు వెలుగుచున్న దీపకళికలతో నా రహస్య గృహమంతయు-మయూరపింఛ సవర్ణవర్ణమై కిమ్మీరితమైనది.

మహామాత్యులందికొన్నారు. "మహారాజా! తమరిట్లుండుట రాజ్యమునకు క్షేమకరముగాదు. ఈ నిర్ణయమునకు రత్నావతీదేవియు మఱుమాట పలుకదని నా విశ్వాసము."

"అమాత్యా! తమరు సెలవిచ్చినది నిజమేయైనను- కౌలీనత నన్నట్లు సేయనిచ్చుటలేదు. పైగా రత్నావతీదేవి

హృదయము శిరీషకుసుమ పేశలము. ఈ విషయము విన్నచో-నామె హృదయ మెంత బాధపడునో! ఒకవేళ వేరు వివాహమును జేసికొన్నను-నాకు సంతానము గలిగితీరు నని యెవ్వరు జెప్పగలరు? కనుక దైవనిర్దేశ మెటులున్న నటు జరగుగాక!''

''మహారాజా! కడకు దైవనిర్దేశమే జరిగితీరు ననుట నిర్వివాదాంశము. కాని పురుషకారము మాత్రము కేవలము ద్రుణీకరింపఁ దగినదా? మీ రెఱుగని ధర్మాధర్మములు నేను వింగడింపఁ గలనని యర్థముగాదు. కాని ప్రజ తమ రెండవవివాహమును గోరుచున్నది. రెండవ కళత్రమునం దైనను అనతికాలముననే దమ ప్రతిబింబమగు గుమారుని గాంచగలమని ప్రజయొక్క యుత్కంఠా కాంక్ష. క్షత్రజాతి ప్రజలకోర్కె లెంతవరకు మన్నింపవలెనో యా హద్దులు దమకుఁ దెలియనివిగావు. రత్నావతీదేవి హృదయమును నేను బాగుగ నెఱుంగుదును. ఆమె నొప్పించు బాధ్యత నాది.''

''నా సోదరుఁడు చెంగల్పట్టు ప్రాంతములకు నాయ కుఁడుగ నున్నాడని మీ రెఱుగుదురుగదా! ఆతని సుతుఁడు-బంగారు తిమ్మరాజును జూచినచో నాకుఁ బంచప్రాణము లగుటయు మీకు దెలియని విషయము గాదు. నా యనం తర మీ సింహాసనము నాతఁడే బరిపాలించినచో మీ యాక్షేపణ యేమి?''

''ప్రభూ! నన్ను మీరు పరీక్షించుచున్నటులున్నది. మా తాతతాతల నుండి మీ వంశమును భక్తితో మేము

సేవించు చున్నాము. ఈ శరీరమునందలి రక్తమాంస ములు మీ యుప్పుదిని పెరిగినవే కాని యన్యములు గావు. సర్వకాలములయందు - సర్వావస్థలయందు మీ యొక్కయు, సామ్రాజ్యము యొక్కయు యోగక్షేమ ములఁ గోరుటయే మాకుఁ బరమధర్మము. లేకున్న మా బ్రాహ్మణ్యమే కళంకితమై పోవును."

మహామాత్యులు గొంచెముసేపాగిరి. వారియెద నిట్టూర్పులచే నమితముగ గంపించుచుండెను. తమ మాయువు నంతయు విద్యానగరరాజు సేవయందే గడపిన యా శరీరము ఏమో కంపించుచుండెను. మహారాజు చూపులు నిశ్చలములైనవి. ఆ చూపులయందేమో భయము - ఆ భయము వెనుక వాక్కులకందరాని యొక కృతజ్ఞతాభావము దొంతికిన లాడుచుండినది. మహామాత్యులపై దేవరాయలకుఁ దన మాతాపితలపై నున్నంత గౌరవము. ఆ చూపుల వెనుక - చాల వెనుక - సామాన్య హృదయముల కందరాని శతధావిభక్తమగు ఒక వేదనయు నుండినది.

మహామాత్యులు దేవరాయలవైపు దిలకించిరి. పిలకించుచునే ఫక్కుమని నవ్వినారు. ఆ నగవులలో దెల్లని గడ్డముతో గూడిన యమాత్యుల ముఖబింబము ఒడలంతయు బూలువిచ్చిన మల్లెచెట్టయినది. అమాత్యుల బాధఁ గాంచినచో మహారాజుల కంతటి వికలత. మహారాజుల వైకల్యము చూచినచో నమాత్యులకంతటి హృదయవ్యథ.

తిన్నగ సంబాళించికొన్న మహామాత్యు లారంభించి నారు. ''మహారాజా! బంగారు తిమ్మరాజుగారి గుణగణములను నేను శంకించుటలేదు. వారిపై దమ కెంత యనురాగము గలదనుటయు నాకుఁ గ్రొత్తగాదు. రత్నావతీ దేవిగారును దిమ్మరాజును దమ కుమారులవలెఁ బ్రేమించిరే గాని యన్యమగు నభిప్రాయము వారి హృదయమునందు లేశమును లేదు. తిమ్మరాజుగారు దమ సింహాసనమునకు వారసులగుచో బంగారునకుఁ దావి యబ్బినటులేయుండును. కాని ప్రజాసామాన్యమునకు దేవరాయల సుతులన్న నభిప్రాయము తిమ్మరాజుగారిపై నుండుట కష్టము. మీ హృదయమునే మీరు దీవ్రముగ బ్రశ్నించినచో, నందు ప్రేమప్రాకారమున దాగిన సామాన్య మానవత్వమును బ్రశ్నించినచో ఆ భేదము మీకే దెలియగలదు.''

అమాత్యులు కొంతసేపాగిరి. ఆ యాగుట మహారాజుల కాలోచించుకొన నవకాశ మొసగుటకు.

అమాత్యులన్న యా కడపటిమాటలు దేవరాయల హృదయమున నేకోణమును దాకినవో - వారు చాలసేపు మాటాడనే లేదు. కొంతప్రొద్దునకు బ్రధాన సచివులవైపు దిరిగి దేవరాయ లన్నారు :

''అమాత్యా! ఈవిషయమును రత్నావతీదేవిగారితో నాలోచింతును. ఆమె హృదయాభిప్రాయ మిందులకు విరుద్ధముగానిచో దమ యా దేశమునకు బద్ధులగుటకు మరియే

యాక్షేపణము లేదు.'' అమాత్యులు దల పంకించిరి. ఆ పంకింపునం దర్థే కానిండను భావముండెను.

అమాత్యుల సైగననుసరించి యొక ద్వారపాలిక వారిని సమీపించి, వజ్రముల పాత్రలలో పానకము లందించినది. వారా పానకము లానిన వెనుక దాంబూలమును సేవించి వారివారి నివాసములకు వెడలిపోయినారు.

రత్నావతీదేవి దేవరాయల రెండవ సంబంధమున కంగీకరించెను. ఆ వార్త ప్రధానామాత్యులకుఁ దెలిసినది. వారి సంతోషమును జెప్పఁ దరముగాదు. ఆ రెండవ యావిడ పేరు రంగాదేవి. వారు సవరమింటివారు. కొందఱు చారిత్రికులు రంగాదేవి క్షత్రియ కాంత గాదనియు, నామె సానివారింటి పడుచనియు నందురు. ఆమె నిజమైన పేరు రంగనానియట! సత్యాసత్యములు దైవమున కెఱుక !

రంగాదేవి కన్న యొకఁడు గలడు. అతని పేరు సవరము నారప్ప. కౌటిల్యమున కాతఁడు పెట్టినది పేరు. రాజకీయములందుఁగూడ వాఁడు నిష్ణాతుఁడు. ఆంధ్రమునం దాతడు కవి గూడ. ''బహుళాశ్వ'' చరిత్రమనెడు చంపూ కావ్యమును వ్రాసినది సవరము నారప్పయే.

రంగాదేవిని దేవరాయఁడు పెండ్లియాడుట నారప్పకు రొట్టెవిరిగి నేతిలో పడినట్లైనది. వాడు బావ ననుసరించి తన నివాసమును ఘనగిరికే మార్చెను. రాజధాని యందలి పరిస్థితులన్నియు వేయిగన్నులతో గనిపెట్టుచుండినాఁడు. ధనాశ గలవానికి ధనము లొసఁగెను. మైత్రికాముకులకు

నెయ్యము లిచ్చెను. అధికార కాంక్షుల కధికారము లొసఁగి నాడు. ఇట్లు రాజు ననుచరుల నాతఁడు చాలమందిని దన వైపునకు లాగికొనెను. వాని ప్రయత్నములకుఁ దోడు దేవ రాయఁడు ముసలివాఁడగుటయు, నందుచే రాజకార్యదక్షత లేకుండుటయు గొప్పయనుకూలములైనవి. నవరము నారప్ప పలుకుబడివలన దేవరాయఁ డాతని దన సైన్యాధిపతులలో నొక్కనిగా నియమింపక తప్పినది గాదు. ఈ యధికార ముతో నారప్పకు లెక్కలు వచ్చినట్లులయ్యెను.

బంగారు తిమ్మరాజు :

దేవరాయలకు సంతానము సంభవించు వయస్సు దాటిపోయినది. ఈ విషయము నారప్ప యెఱుఁగును. అందుచే దాను కొలువు కాండ్రలో దండిగఁ బలుకుబడిని సంపాదించి కొన్నచో దేవరాయల యనంతరము దమ వంశమునకే సామ్రాజ్యము నన్వయింపఁ జేసికొనవచ్చును. రంగాదేవి దనకు సాక్షాత్తు జెల్లెలే గనుక దన ప్రయత్న మున కామె దోడ్పడితీరును. ఒకవేళ దోడ్పడకున్న నామెను గూడ దన నిశిత కరవాలమునకు బలియిచ్చుటకు నవరము నారప్ప జంకుటలేదు. ఇక రత్నావతీదేవి నవరము. నారప్ప కొక లెక్కలోనిదే గాదు. ఆత్మసోదరినే మట్టుపెట్ట దలచిన ఘాతకునకు పరాయియాఁడుదాని వధ యేమి లెక్క! వానికిఁ గనపడుచున్న బాధకుఁ డిపుడొకఁడే- బంగారు తిమ్మరాజు. వానిని రాజు ప్రేమించును. తన యనంతరము వానిని ఘనగిరి సింహాసనము నెక్కింప దేవ

రాయఁడు ప్రయత్నము సేయును. దానికవకాశము లేకుండఁ జేయవలెను. ఆ కార్యమునకు నారప్పకుఁ దోఁచిన యుపాయములు రెండు. ఒకటి - దేవరాయనికి బంగారు తిమ్మరాజుపై మాయోపాయమున వైమనస్యమును గల్పింపవలెను. లేదా - పిట్టకుఁగూడఁ దెలియకుండునట్లు బంగారు తిమ్మరాజును హతమార్పవలెను. తిమ్మరాజు మరణానంతరము దేవరాజుతో బాధఁగల్గినచో నాతని జీవములుగూడ దీసికొనవచ్చును.

ఇన్ని యూహాలు నారప్ప దన మనమున భద్రపరచికొనియుండెను. దీనిని సాధించుటకుఁ దన యధికారమెదిగినకొలదియు మహామాత్యుల యధికారమును తగ్గించుటకు వాడు మాయోపాయములతో యత్నించుచునే యుండెను. ఆతని పాచిక పారునట్లే గనపడినది. రంగాదేవి యంతఃపురమున గాలుబెట్టిన గొన్ని దినములనుండి దేవరాయల ప్రవర్తనయే మారిపోఁజొచ్చెను. అతఁడు ముందటివలె నేఁడు కొలువునకు వచ్చుటలేదు. ఆసనముగాని మధువును, కనులు మూతలువడని యంధత్వమును నగు వైషయిక సుఖరోగ మా దేవరాయలను పూర్తిగా లోఁగొన్నది. రంగాదేవి యాతనిపాలి మోహిని. వాని కన్నుల కమృతదీపవర్తి. వాని దేహమునకుఁ జందనరసము. వాని యాత్మకు మోక్షానంద సబ్రహ్మచారియగు సుఖము. వాని సల్లాపానందములేని నిమేషమునకు వాని దృష్టిలో సౌందర్యములేదు. రంగాదేవి శరీర స్పర్శ లేని

నిముసమునఁ దన శరీరమునకుఁ బ్రాణమే లేదు. రత్నావతీ దేవి నేత్రములందొక యఱనిముసము దడియారుట లేదు. రంగాదేవి యంతఃపురమున నడుగుపెట్టుచు రత్నావతి జీవితమున దొడ్డ దౌర్భాగ్యమునుగూడఁ గొనివచ్చినది.

అమాత్యులందఱును జేరి కలియఁబలికికొన్నారు. చేతులు కాలిన వెనుక నాకులు పట్టుకొని యేమి లాభము! ధర్మాధిష్ఠాన దైవమైన సింహాసనము కాపురము విడచిన పాటిల్లువలె నైనది. మహామండలేశ్వరులకు దేవరాయల దర్శనభాగ్యము లభించుటలేదు. దళవాయులు కోటచుట్టును ప్రదక్షిణించి-నిరాశాపూరితులై వెనుకకు బోవుచున్నారు. విదేశరాయబారులకుఁగూడ నరాధిపుని దరిసెనము దుష్కరమై పోయినది. పరరాజులీ యదను కనిపెట్టి ఘనగిరిపై దండెత్తుటకుఁ గత్తులు నూరుచుండిరి. కాని సోదరీవిలాస పాశములలో భావను బంధించిన నవరము నారప్ప మహామంత్రి మొదలైనవారి యధికారముల తగ్గించుటతోఁ బాటు జాగరూకుఁడై పరరాజులపైనను గన్నుంచియే యున్నాఁడు. సామ్రాజ్యమునం దెచ్చోటగాని, వానికిఁ దెలియని దొక్క విషయము జరుగుటకు వీలులేదు. ఈ ఉపాయమును గమనించిన మహామంత్రులు గూడ వారిసన్నాహముల గావించుచునే యుండిరి. ఎప్పటికప్పుడు చారముఖమున చెంగల్పట్టునకు - దేవరాయల తమ్ములకు మహామాత్యులు వర్తమానము లందించెడివారు.

మహామంత్రు లవసర దర్శనము గావలెనని మహారాజులకుఁ జెప్పిపుచ్చినారు. కాని దేవరాయల కావార్త చేర నేలేదు. నడుమనే నవరము నారప్ప పరివారము ఆ వార్తను హతిమార్చినది. కొన్నిదినములు మహామంత్రు లాగి, మరల సార్వభౌములకుఁ జెప్పిపుచ్చినారు. ఈసారి దేవరాయలకు మహామంత్రుల వార్త యందినది. కాని వారు మహామాత్యులతోఁ గలిసికొను టంత తొందరపని యనుకొనలేదు. రంగాదేవిగారి పాదములకు వారు ఒత్తుకలు దిద్దుచున్నారు. ఆమె యపుడపుడు కనుబొమల జంకెనలతో మహారాజుల శిల్పచాతుర్యమున దప్పులు దిద్దుచుండెను. ఇట్లే కొన్ని మాసములు గడచినవి.

ఇంతలో సామ్రాజ్యమున నవరము నారప్ప శరవేగమున దనపక్షమును బెంపొందించి కొనుచున్నాఁడు. రాజపరివారమునందు రెండు పక్షములు స్పష్టముగఁ జీలినవి. ఇక నాలసించుట జాల ప్రమాద మనుకొన్నా రమాత్యులు. వారు మహారాజునకు విశ్వసనీయులగు భృత్యులతో నిట్లు వార్తనంపిరి: ''ఈనాఁడు నాకు అవకాశము దప్పక యిప్పింపవలెను. లేకున్నచో నే నంతఃపురమునకే వచ్చి రత్నావతీదేవిగారి మందిరమున దమరిని దరిసించి నా కష్టములు విన్నవింప నెంచినాడను.'' ఆ నాటిరేయి రహస్యభవనమున నిరువురు వ్యక్తు లున్నతాసనములపై నధిష్ఠించి యుండిరి. వారిలోనొకరు మహారాజులు; రెండవవారు మహామంత్రులు.

ఇరువురి వదనములును గంభీరములై దీర్ఘాలోచనా కలితములై యుండినవి. అట్లెంతకాలము గడచినదో యిర్వురును గమనించిన వారే గాదు.

మహామంత్రులు ప్రస్తావనమును దిన్నగా నారంభించినారు. "ఈ రోజులలో సార్వభౌములకు శరీరము సరిగా లేనట్లున్నది. అందులకే స్వామి భృత్యులకు దర్శన మిప్పించుట ఆలస్యమైన దనుకొందును."

రాయలు గంభీరముగ దలపంకించిరి. అమాత్యులన్న మాట దమ హృదయమున నెక్కడనో - సత్యాసత్యముల నడిమిచోట దాకినటులైనది.

"మహారాజా! సామ్రాజ్యమున చాలమార్పులుశరవేగమున వచ్చుచున్నవి. వాని నిట్లె యుపేక్షించినచో ధర్మాసనమునకే భంగముగలిగించునంత తీవ్రముగ నున్నవి. అందుచేఁ దమతో మాటాడి వానిని బరిష్కరింపవలెనని యే నేడు దరిసెనమునకై అడిగికొంటిని."

"అయిన నిప్పుడు నన్నేమి చేయుమందురు?"

"తమరి నిట్లు చేయుమని యాదేశించు నధికారము నాకు లేదు. మీ యాదేశముల బరిపాలింపనే మీ భృత్యవర్గమగు మేమెల్లర ముండునది. కాని పరిస్థితులన్నిటిని మీ యెదుట మనవిసేయనిది నాహృదయావేశము దగ్గునట్లు లేదు. సార్వభౌములు దలచుగాఁ బ్రజకు దరిసెన మీకుండుటతో వారియందొక యత్నప్తి బలిసిపోవుచున్నది. నాయకులు, నాయకాచార్యులు, మహామండలేశ్వరులు దమపైని మహా

రాజుల విచారణ సన్నగిల్లుటచే దామే స్వతంత్రులైనట్లు నిశ్శంకముగఁ బ్రవర్తించుచున్నారు. ఈ పరిస్థితులలో రాజద్రోహు లీ యవకాశముల నండగొని - ఘనగిరి ధర్మాసనమును గైవసమొనరించుకొన జూచుచున్నారు. వేగులవారి వలన మన యిరుగుపొరుగు రాజులు మనపై దాడివెట్టఁ దయారగు చున్నట్లులునుఁ దెలియవచ్చినది. ఈ స్థితులలో మనమందఱు జాగరూకులమై వ్యవహరించిన గాని సామ్రాజ్య క్షేమము చక్కనట్లు నాకు గనిపించుట లేదు.''

''దానికి మహామంత్రి యాలోచించిన పరిష్కారమేమి?'' దేవరాయల కన్నులు గంభీరములైనవి. వానిని జూడ-మహారాజులు - అమాత్యులు విన్నవించు బాధలను జాగ్రత్తగ నాకళించుకొను చున్నటు లుండెను.

''రాయలవారు వేఱుగాఁ దలపకున్నచో నాకుఁ దోచిన యొక మార్గమును విన్నవించు కొందును.''

''తమ పరిష్కార మార్గమేదియో జంకులేక చెప్ప వచ్చును. మీ సామ్రాజ్య క్షేమదృష్టి నే నాఁడు క్రొత్తగ నేరపిడి బెట్టవలసినది లేదు.''

అమాత్యుల తెల్లనిగడ్డము అలతినవ్వులలో క్రిందు మీదయ్యెను. వెంటనే వారందుకొన్నారు :

''తమ సుత నిర్విశేషులైన తిమ్మరాజుగారినిసామ్రాజ్యమునకుఁ బిలిపింపుడు. వారిని ధర్మాసనమునందుంచు యత్న మొనరించినచో—''

మహారాజు కన్నులు కొంచె మెత్తవారినటు లైనవి. "తమ యాదేశము ననుసరించియే వివాహమాడుటయ్యెను. తిమ్మరాజు పట్టాభిషేకానంతరము రంగాదేవి గర్భవతి యైనచో?"

దేవరాయలు మాటలాడుచున్నపు డాతని ముఖమున-తన ప్రశ్న కేమియు జవాబు మహామాత్యులివ్వ లేరను భావము స్పష్టముగ గోచరించినది.

పై మాటతో మహామాత్యుల కంఠము గొంతె గద్గదమయ్యెను. "ప్రభూ! చెంగల్పట్టునందున్న దమ తమ్ముని వినయ వివేకములను గురించి నేను దమకు మనవి సేయుట మీ పరస్పర భ్రాతృప్రేమలను గించపరచుట. ఇక నాతని సుతుడైన తిమ్మరాజు - బాలుడైనను - మహామేధావి యనియు, దృఢశీలతనుత్రుడనియు దమరే యెన్నిసారులో నాకు దెలిపియుంటిరి. ఒకవేళ తిమ్మరాజు పట్టాభిషేకానంతరము దమకు సంతానము గలిగినచో నా బాలకుని క్షేమమునకై దిమ్మరాజు ఘనగిరి సింహాసనమును దప్పక వదలును. ఆతనిపై నాకట్టి విశ్వాసమున్నది. పైగా నాతనికిని దమతండ్రిగారి రాజ్యభాగమున్నదిగదా! ఈ సమయమున నాతని బిలిపింపకున్నచో - సామ్రాజ్యములోని జాల నల్లకల్లోలము లేర్పడుస్థితు లున్నవి. మాకును దినదినమునకు వయస్సెక్కి వచ్చుచున్నది. ముందటివలె రాచకార్యములను జూచుకొనుటకు శక్తి చాలదు. కనుక నా విన్నపమును మన్నింతురని యాశింతును.

''సామ్రాజ్యమున నంతటి యశాంతికిఁ గారణము లేనో మేము వినవచ్చునా?''

''ప్రభూ! మీ రన్ని రహస్యములును నానోటి నుండియే వినిపింపవలెనని యాలోచించుచున్నటులున్నది. కొంత గాఢముగ నాలోచించినచో నా విషయములు మీకుఁ దెలియనివిగావు. నా హృదయమునకు బాకుపోటైన యొక యుదంతమును మాత్రము నేను మీతో మనవిసేయక యుండలేను. పతిగత ప్రాణయగు రత్నావతీదేవిగారు కన్నీటి చెలువై పోవుచున్నారు. వారి దుఃఖ వార్త నాకే గాదు-మీ భృత్యవర్గమున కంతయు తీవ్రవేదనా కారణమై యున్నది.''

దేవరాయని కన్నులేనో గడచిన కాలము జూచుచున్నట్లు తోఁచెను. కాని యంతలోనే యా భావమునుండి యాతఁడు దెప్పరిల్లుకొన్నాఁడు.

''అమాత్యా! బంగారు తిమ్మరాజునకుఁ బట్టాభిషేకము సేయుటయందు నాకిపుడంత యుత్సాహము లేదు. రాజ్యాశ మానవునికిఁ జాల ప్రబలమైనది. సింహాసన మధిష్ఠించిన తిమ్మరాజు నా సంతానముకై దానిని విడచునని పూర్తిగ నమ్మలేక యున్నాను.''

అమాత్యు లందుకొనిరి. వారి కనులు కించి దరుణములై, వెంటనే భావ గోపన మొనర్చిన చిఱునవ్వులో ధవళము లయ్యెను. ''మహారాజా! నేనును దమ మాటయే యనువదించుచున్నాను. రాజ్యాశలు మహా ప్రబలములు.

వానితోడనే సామ్రాజ్యమున ననేకములగు కుట్రలు బయలు దేరినవి. దీనిని మనము పరాకున నిర్లక్ష్యముపేక్షించినచో తిమ్మరాజునకే గాదు - మీ వంశాంకురమునకే రతనాల గద్దె యంటక పోవును.''

''ఇపుడు నన్నేమి చేయు మందురు?''

''వెంటనే తిమ్మరాజుగారిని బిలిపింపుడు.''

''నే నిప్పుడే యీ పనిని జేయఁ దలచికొనలేదు.''

అమాత్యు లిక దట్టుకొనలేకపోయిరి. వారి కటము లదరెను. కనులనుండి బొట బొట నీరు గారుచు ముసలి గడ్డముపై బడి మల్లిపూవులపై మంచు బిందువులవలెఁ బ్రకాశించెను. తటుక్కున వా రాసనమునుండి లేచిరి. దేవరాయలకు గలిగినది వెఱపో, యాశ్చర్యమో, కోపమో, యేభావమో - మహామంత్రులకై యేకదృష్టితోఁ జూచు చున్నారు.

''ప్రభూ! ఇదిగో మీ యమాత్యాంగుళీయకము. తమరు నా కొసగిన పదవిని మరల దమ పాదమూలమున నర్పించుచున్నాను. మా తాత తాతలనుండి మీ వంశమున మెలఁగితిమి. మరి నా యీయాయువున నీ సామ్రాజ్యము దళిత మగుట నాకిష్టము లేదు. ఇప్పటి పరిస్థితులలో మహా మంత్రిగనుండి మిమ్ములను సేవించుటకంటెను సామాన్య పౌరుడుగనుండి సేవించుటయే నా కభిమతము. సెలవీయ బ్రార్థింతును.''

మఱు నిమేషమున దేవరాయఁడు అమాత్యుల కౌగిలియందున్నాఁడు. ఇరువురి కనులయందును నొక్క తే జడివాన. ఓరంత ప్రొద్దట్లె గడచినది. మఱుదినముననే బంగారు తిమ్మరాజునకు రాజధానికి రావలసినదని వర్తమానము వెళ్లినది. వారితోఁ బాటు మహామాత్యులుగూడ నొక లేఖ నంపిరి. దానియందు-రాజధాని పరిస్థితులు కల్లోలితముగ నున్నవనియు, వెంటనే దిమ్మరాజును దొందరగఁ బంపవలెననియునుండెను. తానిచటఁ గుమార తిమ్మరాజును వేయికన్నులతోఁ గనిపెట్టుకొని యుందుననియు, నాతని కే బాధయు రానివ్వననియు గూడ నందు లిఖింపబడి యున్నది.

ప్రయాణవార్త :

చెంగల్పట్టును బాలించు రేడు చిన్న దేవరాయడు. చిన్న దేవరాయలు దేవరాయలకు సామంతుఁడే. సామ్రాజ్యమునకుఁ బ్రతినిధిగఁ జెంగల్పట్టున నిలిచి, దాక్షిణాత్యుల మెలఁకువల గమనించు చుండెను. రాజధాని యందుఁ గలుగుచున్న కల్లోలము లెప్పటికప్పు డమాత్యుని చారులమూలముగ నాతనికిఁ దెలియుచునే యున్నవి. కాని మహామాత్యుల రాజకీయప్రౌఢిమ చిన్న దేవరాయఁడు జక్కగ నెఱుగును. అందుచేఁ దానా విషయములలో జోక్యము కల్గించుకొన దలఁపలేదు.

మహామాత్యుల యుత్తరము చిన్న దేవరాయఁడు జూచివాఁడు. సవరము నారప్ప రాజకీయ కౌటిల్యదక్షతయు

దేవరాయల యమాయకపుదనముగూడ జిన్న దేవరాయఁ డెఱిగినదే. కాని మహామాత్యులు వ్రాసిన "తిమ్మరాజున కే యాపదయు రానివ్వక గనిపెట్టికొని యుందు" ననుమాట యాతనికి గుండెధైర్య మొసఁగినది. అందుచే బంగారు తిమ్మరాజును రాజధాని కంపుటకే చిన్న దేవరాయలు కృత నిశ్చయుఁడయ్యెను.

ఏకాంతమున జిన్న దేవరాయఁడు దన భార్య కీవార్త నెఱింగించెను. ఆమె పేరు బంగారమ్మ. చిన్న దేవరాయల హృదయాభిప్రాయము నామె విన్నంతనే యెందులకో బంగారమ్మకు భయమైనది. ఇప్పటి పరిస్థితులలోఁ దన కుమారు నక్కడికి బంపవలదని తన హృదయము నుండి యెవరో బలికినట్లామె కర్థమయ్యెను.

శయనాగారమున నొక శయ్యపైఁ జిన్న దేవరాయ లధివసించి యున్నారు. వారి పాదములు చిఱుగద్దియపై నుంపబడి యుండెను. ఆ యంఘ్రులచెంత బంగారమ్మ గూర్చొని యున్నది.

"మహారాణీ! బంగారు తిమ్మరాజును రాజధానికి బంపగూడదని నీ వింత దీనముగ మంకుపట్టు బట్టుటలో నర్థములేదు. అక్కడ మహామాత్యు లున్నారు. వారు మనవానిపై నీగను వ్రాలనీయమని వ్రాసిన కమ్మను నీవే జూచితివిగదా! మన వాని కేమియు భయములేదు. ఇపుడు మన ముపేక్షించినచో రాజధాని సింహాసన మన్యాక్రాంతమై పోవును."

బంగారమ్మ యన్నది: “నాథా! అమాత్యులు రాజకీయ చతురులే. అందునకు సందేహములేదు. కాని వారికి వయస్సెక్కువైనది. అందుచే మన పిల్లవానిని సర్వకాల సర్వావస్థల యందును జూచుకొను నుత్సాహము, శక్తియు వారి శరీరమున నుండదు. సవరము నారప్ప త్రాఁచువంటివాఁడు. వాని యెత్తులు గ్రహించుట కెట్టివారును నేరరు. పైగా వయసున నుండుటచే పాదరసమువలెఁ బారాడ గలఁడు. మీ యన్నగారగు దేవరాయఁడు రంగాదేవి పట్టిన పక్షియై పోయినాఁడట! మనస్వినియగు తమ వదినె రత్నాదేవిగారికే కన్నీరు మున్నీరుగ నున్నదని విన్నాను. అతఁడు సవరము నారప్ప వేయు ఎత్తులను గనుగొనలేఁడు. ఒకవేళ గనుగొన్నను శావమతఁడు వేయు ఎత్తుల స్వీకరించినాఁడా యనియు నా చిత్త మాశంకించుచున్నది. పాపము శాంతమగుగాక. ఇట్టి స్థితిలో ముక్కు పచ్చలారని తిమ్మరాజు నక్కడికిఁ బంపుటకు నామన సొప్పుట లేదు.”

“దేవీ! గ్రుడ్డిదగు ప్రేమచే నీ తార్కిక జ్ఞానము గుంటువడినది. నీవన్నట్లు ప్రధానామాత్యులు ముసలి వారే గావచ్చును. కాని, వారు మన కుమారుని క్షేమము నుపేక్షింతురనుటకు వీలులేదు. ఆ ముసలి యమాత్యులమేధాశక్తిముందు ఒకడుగాదు–వేయిమంది సవరము నారప్పలు హతమారిపోవలసినదే. పైగా–జ్ఞానవృద్ధుఁడును వయోవృద్ధుఁడును నగు నాత డంత యాలోచింపకయే మనకు వర్తమాన మంపియుండునా? తనచేత నిజ

ముగా గాకున్నచో వా రుపేక్ష వహించియే యుండెడి వారు. కాని మన కుమారుని పంపుడని వ్రాసి యుండరు. నీవు కేవలము స్త్రీ సహజమగు భయముచే సిరిరా నెూకా లొడ్డుచున్నావు. ఇంకను గొంత బాగుగా నాలోచించి కొనుము.''

బంగారమ్మ మఱి యేమియు మాటాడలేదు. చిన్న దేవరాయలు మాత్రము కన్నుమూసిరి. బంగారమ్మ యారేయి యంతయు మేలుకొనియే యుండినది. అప్పు డప్పు డామె కన్నుల నీటి బొట్లు జారి, చెక్కిళ్ళపై బడి, కాచ దీపముల వెలుగులోఁ దళ తళ లాడుచుండెను. ఆ దుఃఖ మెందులకో యామెకే దెలియదు. కాని బంగారమ్మ మన స్సునకు మాత్రము శాంతిలేదు.

మఱుదినమున జిన్న దేవరాయలు దమ భవనమునకు దిమ్మరాజును బిలిపించిరి. యోగక్షేమములు విచారించు టైన తరువాత చిన్న దేవరాయలు గుమారునితో నన్నారు: ''నాయనా! రాజధానినుండి మహామాత్యులు వార్తలంపి నారు. అక్కడి పరిస్థితులు జూడ నల్లకల్లోలముగ నున్న వట! సవరము నారప్ప కుట్రలు దినదినమునకు మితిమీరి పోవుచున్నవి. ఇప్పటి పరిస్థితులలో మనవా రెవ్వరు నక్కడ లేకుండుటచే రాజ్య మన్యాక్రాంతమగుట కవకాశ మున్నది.''

బంగారు తిమ్మరాజు జకితుఁడై నాఁడు. ''నాయన గారూ! పెద్దనాయనగారు స్వస్థులుగనే యున్నారుగదా!''

"స్వస్థులుగనే యున్నారు. కాని యీ నడుమ వారు రెండవ భార్య రంగాదేవిగారి చేతిలో గీలుబొమ్మయైనారు. అందుచే నవరము నారప్ప దుశ్చర్యలెక్కునై పోవుచున్నవి. వాడు రాజసేవకులయందును, సైన్యములందును రెండు కక్షుల లేవదీసినాడు."

"కాని వాని దుశ్చర్యలు పెత్తండ్రిగారి దృష్టినుండి దప్పించుకొనియుండ వనుకొందును. మీరు జెప్పు మాటలచే మా పెద్దమ్మ రత్నావతీదేవిగా రెట్లున్నవో యని మనసు చీకాకు..."

"నేను జెప్పవచ్చినదియు నా విషయమే. ఈ నడుమ రత్నావతీదేవిగారిని మహారాజులు బుస్కరించుట లేదు. అందుచే నామె పాట్లు పౌరలగు నష్టపుచుండునట! ఈ పరిస్థితులన్నియు జూచియే మహామాన్యులుగారు నిన్నక్కడికి బంపవలసినదిగా వారను బుద్ధించినారు."

బంగారు తిమ్మరాజు మొగము సంతోషమున జేవంత మైనది. తాను వెళ్ళి తొందరగా రత్నావతీదేవిని దర్శించి యామె స్థితిని సవరింపవచ్చునని వానియుత్సాహము.

"తమ యాజ్ఞయైనచో దప్పక వెళ్ళి వత్తును. నాకు రత్నావతీదేవిగారిని చూడవలెనని యమితముగా నపేక్ష యున్నది.'

"నేనును బంపవలెననియే దలంచుచున్నాను. కాని మీ తల్లి సమ్మతించుటలేదు. ఆమె యక్కడ నీకశుభములు గలుగునని యాశంకించుచున్నది." చిన్న దేవరాయలు

ప్రత్యుత్తరము నాకాంక్షించువారివలె కుమారుని వైపు జూచిరి.

"నాయనా! మాతల్లి నాపైనున్న యమితవాత్సల్యముతో నట్లనెను. "అతిస్నేహః పాప శంకీ" యనుట మీకుఁ దెలియనిదిగాదు. ఆమెకు నయమున నేనును నచ్చజెప్పెదను. పెనుగొండపట్టణమున నాపై నీగ వ్రాలనీయకఁ బెద్దమ్మ నన్ను రక్షించును. నా కామెను జూడవలయునన్న యాకాంక్ష తీవ్రముగా నున్నది." కుమారుఁడు తండ్రి వైపు జూచినాఁడు. ఆ చూపులయందు దన ప్రార్థనను మన్నింపవలసినదను భావముండెను.

తండ్రిగారనిరి: "నాయనా! నాదేమున్నది? మీ తల్లి యంగీకరించినచో నా కేయాక్షేపణయు లేదు. కాని యామె హృదయమును నొప్పించి మాత్రము నిన్నంపుటకు నేను సిద్ధముగా లేను."

తరువాత మరికొంతసేపు దండ్రికొడుకులకు మధ్య మాటలు సాగినవి. వానిలో గొన్ని దమ కుటుంబమునకు సంబంధించినవి. కొన్ని "చెంగల్పట్టు" రాజ్యమునకు సంబంధించినవి. నడుమ నడుమ "పెనుగొండ" యను పేరును వానియందు వినిపించుచుండినది.

త్యాగశపథము :

బంగారమ్మ నొప్పించుటకై కుమారుఁడు బయలుదేరి యామె భవనమునకు వచ్చినాఁడు. అపుడు ప్రాతఃకాల సమ

యము. బంగారమ్మ ప్రాతఃకాలముననే జలకమాడి పసుపు, కుంకుమ మొదలగు సుగంధ ద్రవ్యములను బళ్లెమునందుంచుకొని తులసిపూజ చేయుటకు బోవుచుండెను. కుమారుఁడు వినయమున నామెకు నమస్కరించి "అమ్మా! నాకు ఘనగిరికిఁబోవ సెల వొసంగుము. నాకు బెద్దమ్మను జూడవలె నను తత్తర మెక్కువగా నున్నది" అనెను.

ఈ మాటలు కుమారుడన్నంతనే యామె శిరస్సుపై నెవరో వాడియగు శూలముతోఁ బొడిచినటులయ్యెను. బంగారమ్మ యేమియు మాటాడలేకపోయినది. ఆమె హృదయము సుతవియోగమునకే మాత్రము సమ్మతించుటలేదు.

ఇంతలో మరల తిమ్మరాజు "తల్లీ! నీ వేమియు శంకింపకుము. నీ యాశీర్వాదము నాకు సమస్తాపదలందును వజ్రకవచము. దయచేసి సెలవొసంగుము" అనినాఁడు. బంగారమ్మ కాలోచించుకొనుటకైన నాతఁడవకాశమీయలేదు. ఆమె నిట్టూర్చినది.

"మంచిది నాయనా! నేనేమి చేయుదును? మీ రెవ్వరును నామాట వినునట్లు లేదు. పోయిరమ్ము. దైవ మెంచినట్లగునుగాక!" యని యస్పష్టముగఁ బలికినది.

తిమ్మరాజు తల్లియానతి గైకొని బయలుదేరినాఁడు. అతఁ డచ్చట నిలువలేదు. వెళ్లుచున్న తన కొమరునిఁ గాంచుచున్న బంగారమ్మ కనులు కాచదీపములవలె వెలిగినవి.

ఓరంత ప్రొద్దునకు బంగారమ్మ యెట్టకేలకు దెప్పరిల్లి వెంటనే తనదగ్గఱ నున్న చెలికత్తె నొకతె నుద్దేశించి "మాలతీ! నీవు మేఖలాదేవి భవనమున కేఁగి తిమ్మరాజు ప్రయాణ మెటులైన నాపవలె నని చెప్పుము. ఇది రాజమాతయాజ్ఞ యనియు విన్నవింపుము. వెంటనే పొమ్ము" అని యాజ్ఞాపించెను. మాలతి పరుగువారినది. ఆపరుగొట్ట రెండుకొండల నడుమ తెకతెకరాచుచున్న సెలయేటి గాజు లాటవలె నుండెను.

తల్లి నిగూఢ దిమ్మరాజొప్పించినాడని చిన్న దేవరాయలకుఁ దెలిసినది. ఇక గజనాథుని పయనమున కాటంకమేమి యున్నది? మఱుదినమే రాజు యువరాజు ప్రయాణభేరిని ఊర మ్రోయింపజేసెను. ప్రాతఃకాలమున ప్రయాణమని బంగరు తిమ్మరాజునకొక యుత్సాహము. ఆ నాటి సాయంకాలమున నాతఁడు మేఖలాదేవి గృహము కరుదెంచినాడు. మేఖలాదేవి యాతని భార్య.

ఆమెయు నాతని కొరకెదురు చూచుచున్నట్లే యున్నది. తిమ్మరాజు భవన ప్రథమ ద్వారమును సమీపించెనో లేదో-పనికత్తెలు లోనికిఁ బరువెత్తినారు. మేఖలాదేవి తిమ్మరాజునకెదురు వచ్చినది. వెంటనే "మేఖల" భర్తకు నమస్కరించెను. ఆ క్రియయందు ఘల్లుఘల్లుమన్న గాజులును, కల కలమన్న మేఖలయు నామె యొయ్యారమునకొక వింత మెఱుగునే గూర్చినవి. బంగారు పళ్లెరమున భర్త కామె పాదములు గడిగినది. తలవంచి యామె

భర్త పాదములు గడుగుచున్నవేళ నామె చిఱునవ్వులలో నాతని పాదములు ముక్తాదామ శోభాభిరామము లయ్యెను. ఆమె కనుచూపు లాపాదములఁ జుట్టుకొన్నవి. అవి నవోత్పల శ్రీవిడంబములై యామె పూజకు మఱింత మాంగల్యమునే గలిగించెను. నగిషీపనిచేసిన తెల్లని పట్టువస్త్రముచే మేఖల తిమ్మరాజు పాదముల దొత్తినది. ఆ ప్రతి యొత్తును నామె హృదయమునందే యెవ్వరో యొత్తినట్లు లుండినది. వారిద్దఱు నభ్యంతర గృహమునకుఁ బోయిరి.

ఆ భవనము దీపశిఖా సహస్రములచే వెలుఁగుచుండెను. ఆ దీపకాంతులందు మేఖలాదేవి సౌందర్యము వసంత శోభలను గలిగించుచుండినది.

"మేఖలా! నేను రేపు ప్రాతఃకాలముననే పెనుకొండకు ప్రయాణమై పోవలసియున్నది. అందుచే నీతో జెప్పిపోదమని వచ్చితిని."

"యువరాజులింతత్తొందరగ ఘనగిరి దుర్గమునకు బోవలసిన యవసరమేమి గల్గినదో—మీ దాసురాలు దెలిసికొనవచ్చునా?" మేఖలాదేవి చిఱునవ్వు నవ్వుచునే యీ మాటలన్నది.

"తెలిసికొనగూడనిదేమి? మా పెదనాయనగారి బావమఱది—నవరము నారప్ప దుశ్చర్య లెక్కువైనవట! పెదనాయనగారిక వయసు జెల్లుచున్నది. అందుచే ముఖ్యపట్టణమున మే మెవ్వరమైన నుండుట రాజ్యమునకు హితంకరమని ప్రధానామాత్యులు జెప్పి పుచ్చినారు."

"సవరము నారప్ప గొప్ప రాజనీతికుశలుడనివిన్నాను." ఈ మాటలాడుచున్నపుడు మేఖలాదేవి కనులు భావచకితము లైనవి. ఆ కనులయందేమో యొక గూఢమగుభావమును నణిగియుండెను.

"కావచ్చును. కాని మహామాత్యులుగూడ సామాన్యులుగారు. నేను రాజధానియందున్నపుడు నాపైన నీగ్రపాలక రక్షింతురని నాకు నాయనగారికి గబురంపినారు. అందుచే నాకేమియు భయముండదు."

మేఖలాదేవి యనుకొన్నది. "మనము ముఖ్యపట్టణమునకుఁ జాలదూరమున నున్నాము. అట్టిచో మహామాత్యుల మాటలకు యథాతథముగా నెలకట్టుల రాజనీతి విజ్ఞత గాదేమో!" ఈమాటలనుచున్నపుడామె గుండె యేలనో జంకెను.

తిమ్మరాజునకుఁ గను లెఱ్ఱవారినవి. "ప్రేయసీ! నీ రాజనీతి గురుజనులనుగూడ ధిక్కరించుచున్నది." అతఁడామెవైపుఁ దీక్ష్ణముగ జూచినాడు.

ఆమె యంతలో సంబాళించుకొన్నది. "నా యభిప్రాయమును మీరు సరిగా నూహింపలేదనుకొందును. మహామాత్యుల రాజభక్తిని నే నాశంకించుటలేదు, కాని వారికి వయస్సు చెల్లినది. అందుచేఁ గూటనీతి కుశలుఁడును, శరీర దార్ఢ్యము గలవాఁడును నగు నారప్పకు సరికి సరి యెత్తులు వేసి పోరాడలేరేమో యని మాత్రమే యంటిని."

"అట్టిచో నాచేత ఖడ్గమున్నది. అది పదిమంది నారప్పలకు బదులు చెప్పఁ గలదు." తిమ్మరాజున కొడలు గంపించెను.

"మీపరాక్రమమును నేను దక్కువగ జూచుటలేదు. కూటనీతి కుశలుఁడగు నారప్ప యనేకులగు నాళలు సూప తన బలఁగము నెంతయో జేర్చికొని యుండును. మీరు పోయిన వెంటనే యంతటి బలఁగ మేర్పడుట దుర్ఘటము. అట్టిచో మీ కెంతి విక్రమ మున్నను—"

"కావచ్చును. ఆనాఁడభిమన్యుఁ డుండిన దొక్కఁడే. ప్రతిపక్షు లనేకులు." ఈ మాట లాతనికి దెలియకయే హఠాత్తుగ వచ్చినవి.

మేఖలాదేవి మొగము వెలవెలఁబాఱి పోయెను. ఆమె హృదయాగారమున నేవేవియో యనుకొనని భావ దృశ్యములు జకచక గదలిపోయినవి. అంతవరకును విజ్ఞతతో మాటలాడుచున్న ఆమెయందు స్త్రీత్వ మొక్కసారి యువ్వెత్తుగా పొంగిపొరలినది. ఆమె నాథుని గట్టిగ కౌగి లించుకొన్నది. "ప్రభూ! మీరు ఘనగిరికిఁ బోవ వీలు లేదు. రాజమాతయు నా యభిప్రాయమునే వెల్లడించుచున్నది. దయచేసి యీ సమయమునం దాగుడు. మఱి కొన్ని దిన ములు గడచిన వెనుక బోవచ్చును. ఇది నా మనవి." మేఖలా దేవి బోరున నేడువ సాగినది.

బంగారు తిమ్మరాజున కేమియు దోచినదిగాదు. తన ప్రయాణమును నిలుపుటయందు వీరి కింత బట్టుదల ఏల?

సవరము నారప్ప యన్న నంత భయము వీరి కెందులకు? ఈ మాట లాతనికి దోచుకొలేదియుఁ దనలోనున్న క్షాత్రశక్తి విజృంభించుచుండెను. ఆ సవరము నారప్ప శక్తి యెట్టిదో యొక్కసారి పట్టిచూడవలె నను బట్టుదలయు నెక్కువగు చుండినది.

ఆతఁ డన్నాఁడు: "మేఖలా! మీకింత పిఱికితన మెవ్వరు నూఱిపోసిరో నా కర్థ మగుటలేదు. మీ యభిప్రాయానుసారము సవరము నారప్పకు కీలు రాజ్యము లందు మఱి యెవ్వరును లేరన్నమాట! అట్టిచో నతఁ డొక్కడే దక్షిణాపథమునంతయు నేలవచ్చును. పిచ్చిదానా! అక్కడ నాతని యెత్తులకు మాఱెత్తులు వేయు నుత్సాహము గలవా రెవ్వరును రాజరక్తమున లేకుండుటచే వాని యాటలు సాగుచున్నవి. నేను ముఖ్యపట్టణముఁ జేరినచో మూఁడు రోజుల కాయాటలన్నియు గట్టిపెట్టించెదను. నీవేమియు భయ పడకుము. రాజకార్యములు సమగ్రముగ నిర్వహించి, మరల త్వరలోనే నినుజూడవత్తును. ప్రయాణసమయమున గన్నీటి ధార శుభావహముగాదు." ఈ మాట లనగానే యామె దటుక్కున గన్నీరు చీరచెఱఁగుతోఁ దుడిచికొన్నది.

ఇక నెట్లును యువరాజు దనమాట వినడని మేఖలకు దృఢమైపోయెను. ఆమె యేమిసేయును! మానవహృదయ మున కెట్లో యొకరీతి శాంతిగావలెను. ఇందుచే నామె దిమ్మరాజుపక్ష మవలంబించి - తన హృదయమున దానే తర్కించికొనసాగినది. ఆమె మనసున నిపు డిఱువురు

వ్యక్తులున్నారు. ఒకరు తాను. మరియొకడు తిమ్మరాజు. మేఖలాదేవి ప్రశ్నించును. తిమ్మరాజు సమాధానమొసంగును. మరల నామె యువరాజు నూహల ఖండించును. మరల యువరాజు సమాధానమిచ్చును. ఈరీతి నామె హృదయ మారాత్రియంతయు రెండు కత్తులు విడువక రాచికొనుచున్న యుద్ధరంగమై పోయినది. ఆ రేయి పూర్తిగా మేఖల యొక నిముస మయిన గనుమూయలేదు. ఇంతకు నామె వాంఛించిన శాంతి మేఖలకు లభించనేలేదు.

అర్ధరాత్రి మీరినది. సమయము గడచుకొలదియు మేఖలాదేవి హృదయముపై నెవ్వరో బలముగా సుత్తెతోం గొట్టుచున్నటు లుండినది. ఆమె కొంతసేపు శయనముపైని బడి దొరలును. కొంతసేపు లేచి కూరుచుండును. కొంత సేపు పచారుసేయును. పచారుచేయుచున్నపుడు పరిచారకు లామె వెంట నడతురు. ఆమె వారిని గఠినముగ జీదరించి కొనును. వారి యుపచారవాక్యము లామెపాలిటి కప చారవాక్యములకన్న గఠినమై యుండెను. చాలసేపిట్లు మనసులో మథన పడిపడి కడ కొక సారి యామె "మదనికా" యన్నది. అది యొక దాసిపేరు. మదనికయు మేలుకొనియే యుండెను. ఆ సమయమున దన్నంత యాదర మున మేఖలాదేవి బిలచునని మదనిక గలనైన భావింప లేదు. అందుచే దనపేరపు డామె స్మరించుట యా దాసికిం గనకాభిషేక మొనరించునటులైనది. పరుగు పరుగున నది మేఖలను సమీపించి "యేమమ్మా" యనెను.

మేఖలాదేవి మఱి మాటాడినదిగాదు. మఱల నామె బరధ్యానమున బచారు సేయుచున్నది. ఆ సమయమునం దామె వాలకము పలువిధములై యుండెను. ఆమె యూరక నిట్టూర్చుచుండెను. ఆ నిడుద యూర్పులలోనే మఱియొక సారి "మదనికా" యని పిలుపు వినవచ్చెను.

"తల్లీ! నేనిక్కడనే యున్నాను. సెలవేమి?" మదనిక యన్నది. ఆమె ముఖముపై సంభ్రమాశ్చర్యభయములు బెనగొన్నవి.

మేఖలాదేవి గిరుక్కుమని వెనుదిరిగినది. ఆమె ముఖ భంగిమ యదేదో క్రొత్తతీరుగ నుండెను. మేఖలాదేవి దన్నట్లు జూచినపుడు - సహజధైర్యవతియైనను "మదనిక" క్షణము గంపించెను.

మేఖల యన్నది: "మదనికా! నీనుండి నేను గోరు చున్న దిపు డొక మహాత్యాగము. పలుమాటలేల? నీప్రాణ త్యాగము." ఈ మాటలు మేఖలగాక యామెలోననుండి యెవరో పలికిరి.

తన్నట్లు హఠాత్తుగ మేఖలాదేవి యడిగినందులకు మదనిక యేమియు నాశ్చర్యపడలేదు. అందులకు గారణ మామె సర్వదా రాజకుటుంబమునకు బ్రాణదాన మొనర్పు టకై సంసిద్ధముగ నుండుటయే. "మేఖలాదేవీ! మీరు నన్ని ట్లడుగవలసిన పనియే లేదు. సర్వకాలములందును మీ సేవ కుపయోగపడుటయే మాకు మహాభాగ్యము. రాజభక్తి ముందు శరీరము తృణప్రాయము. కావున మీరీ

విషయమున నా యభిప్రాయ మడుగ నవసరములేదు. ఆజ్ఞ యిచ్చుటయే మహాభాగ్యము''-మదనిక కంఠ మావేశ ముతో గంపించినది.

మేఖలాదేవి యందుకొన్నది: "మదనికా! తిమ్మ రాజుగారు ప్రాతఃకాలమున ఘనగిరికి ప్రయాణమై పోవు చున్నారు. రాజధాని యంతయు నవరము నారప్ప కూట విద్యచే నట్టుడికినట్లుడుకు చున్నదట! నే నెంత జెప్పినను. మా యత్త బంగారమ్మగా రెంత వివరించినను నా భర్త దమ ప్రయాణమును మానునట్లులేదు. ఈపరిస్థితిలో నామనసు నూటిమాటికి నమంగళము నాశంకించుచున్నది. కనుక నీవు వారి వెంటనుండి వారిని రక్షింపవలెనని నాయాకాంక్ష."

మదనిక ఫక్కుమని నవ్వినది. "పిచ్చితల్లీ! ఇంతటి చిన్న పని కింతసేపటినుండి బాధపడవలెనా! తప్పకపోదును. తిమ్మరాజులను రక్షించుటకే త్యాగము నైనను నవ్వుచుం జేయుదును. మృత్యువును వెదొందుదును. అగ్ని పుడసిలింతును. చెలరేగు పులి కోరలు పెరికెదను. ఇంకేమి జేయవలెనో చెప్పుము."

మదనిక యీ మాటలాడుచుండగనే వృక్షాగ్రములపై బక్షులు గూసినవి. నల్లని యాకాశమున నొక వైపునుండి విబూదిరేకలతో సమానమైన కాంతులు పొడుచుకొని వచ్చుచుండెను. అవి గతించిన దినచితినుండి కాలస్మశాన మున నెగురు బూడిదలాయేమి! లేక నిశాకరవిరహ

సంతప్తచిత్తయగు నిశాసతీ ముక్తాహారముల ముత్తెములు దుఃఖ త్రుటితములై దిశలకు జిందినవా యేమి?

త్యాగాగ్ని :

చారులమూలమున-బంగారు తిమ్మరాజుల యాగమన వార్త ఘనగిరి దుర్గముననున్న మహామాత్యుల కపుడే వెళ్ళినది. అమాత్యులకడ కావార్త వెళ్లుటతోఁబాటు సవరము నారప్ప సమీపమునకును వెళ్ళినది. ఇక వానికిదిక్కుఁ దోచినది గాదు. కొంతకాల మాతఁ డేమో యాలోచించుకొనినాఁడు. ఆ యాలోచనలో ననేక యూహ లాతనికి మొదలినవి. కడ కొకసారి వాఁ డపుడు గఱచెను. ఆ కఱచుట గార్యనిశ్చయ చిహ్నము.

బంగారు తిమ్మరాజు చెంగల్పట్టునుండి ప్రయాణమైనాఁడు. అత డొక సైంధవము నధివసించియుండెను. ఆ యశ్వ ముత్సాహమున నేలపై నిలచుటలేదు. అతఁడు ధరించిన దపారపు చుంగులు గాలికి రెపరెప లాడుచుండినవి. ఆతని మకరకుండలముల ధగధగ ద్యుతులు జెక్కుటల్లపై ప్రతిఫలించి వింత నీరాజనములు గూర్చినట్లున్నది.

తిమ్మరాజునకు ముందొక యైదునూర్ల సిపాయిలు నడచుచుండిరి. వారు శౌర్య రసావతారులు. ఆ సైన్యమునకు వెనుక నిన్నూఱుమంది గుఱ్ఱపురౌతులు నడచుచుండిరి. వాని నొక నూత్నాగంతుకుడు సైన్యాధిపతి నడపించుచుండెను.

తిమ్మరాజును సాగనంపుటకై నాఁడు చిన్న దేవరాయలును, బంగారమ్మయు, మేఖలాదేవియుఁ గోటవెలుపలికి వచ్చియుండిరి. తిమ్మరాజు తనపై బెంగబెట్టుకొనవలదనియు, దాను లేనికొలఁత యమ్మను బాధింపకుండ జూచికొనవలెననియుఁ దండ్రికి మనవిజేసినాఁడు. తండ్రి యట్లే యొనరింతుననుటకై దలనూపెను. ఆ యూపునందికొన్న కుమారుఁడు జెంగున హయముతో ముందుకు జౌకళించినాఁడు. చిన్న దేవరాయఁడు దలనెత్తులోపల దిమ్మరాజు గుఱ్ఱము దనమాటఁ గుమారునకు వినిపింపనంత దూరము సాఁగిపోయినది. చిన్న దేవరాయఁడు గడమాట యేమి జెప్పదలచికొనెనో పాపము! అంతవరకు నేశంకయులేని దేవరాయని హృదయము నేదో భయమకస్మాత్తుగా నావరించుకొనినది. తనకోట వైపాతఁడు దలమలపు చూచెను. కుమారుఁడు లేని కోట కోటగానట్లె యున్న దాతనికి. తిన్నగ గాళ్ళీడ్చుకొనుచు జిన్న దేవరాయఁడు నగరికి వచ్చివేసెను.

క్షణకాలమునందే యా గుఱ్ఱపురౌతుల గుంపు పూర్వరాత్రియే బయలుదేరిన యాహారపదార్థముల బండ్లను వెనుకవేసెను. ఆ గుఱ్ఱపురౌతులతో సరిగ బోలేని కాల్బలము జాలవెనుక నిలచిపోయినది. మొదటిరేయి వారొక పల్లెపట్టున రాణువ విడిసిరి.

రెండవరోజు బయనము సాఁగినది. ఆనాఁడు దిమ్మరాజు నెదుటనొక సైన్యాధ్యక్షుడు వచ్చినిలచెను. గుఱ్ఱ

ముపైనున్న యువరాజు తలనెత్తి చూచినాఁడు. అతఁడు మేఖలాదేవి బంపిన యశ్వసేనా నాయకుఁడు.

"ప్రభూ! నాదొక మనవియున్నది."

"ఏమది?"

"మనసీమ గడిదేశముల నెప్పుడో దాటివచ్చితిమి. ఇకఁ బోవలసినవన్నియు గొత్తభూములు. ఎప్పటి పరిస్థితు లెట్టులుండునో మన మెఱుగము. కనుక గొంత యాలస్య మయినను సైన్యమంతయు గలసియే వెళ్లవలయునని నా మనవి."

"అవునవును. సేనాధిపతి చెప్పిన మాట చాలా యుత్తమమైనది. ఈ మాటలన్న వా రిరువురు ప్రధానులు. అందున నొకరి పేరు హొస్సేన్. మరియొకరి నామధేయము హుస్సేన్. ఈ యిరువురును బాల్యమునుండీ మా తిమ్మ రాజునకు ప్రాణస్నేహితులు. మిత్రవియోగమును క్షణకాల మోర్వక యువరాజు వెంటనే గదలివచ్చినారు. వారు మహమ్మదీయులు. కాని ప్రేమలకు బాహ్యములగు నేనియ మములును లేవుగదా!

బంగారు తిమ్మరాజు వారి వాక్యములకు సమ్మతించి నట్లు దలనూచెను. అందుచే రెండవనాటి ప్రయాణము నిమ్మళముగనే సాఁగినది. సైన్యమునకు నడుమ యువరాజు బద్మమునందు గర్ణికవలె నున్నాఁడు. అతని కిరుపైపుల హొస్సేన్ హుస్సేనులుండిరి. కొంచె మెడముగా మేఖలా దేవి బంపిన సైన్యాధ్యక్షుఁడు వచ్చుచుండెను. అతని కనులు

నాలుగు దిక్కులను జాగరూకతతోఁ బరిశీలించుచున్నవి. చీమచిటుకన్న నాతని జాగ్రత్తనుండి దప్పిపోవుటలేదు.

మూఁడవరోజుగూడ గతించుచున్నది. అపరగిరి మస్తములపై ముసలిహర్యక్షమువలె హరిబింబము ప్రకాశించుచుండెను. చూడఁజూడఁగనే యదియుఁగూడ మునిఁగిపోయినది. కాని చీకటింకను సంపూర్ణముగ గ్రమ్మినవి కావు. సూర్యబింబము పతనమైపోయినను వెలుగింకను మసకమసకగా నుండినది. అప్పటి యాకసము సుఖదుఃఖసమ్మిశ్రితమైన సంసారమువలె నుండెను. పక్షులు శ్రేణులు గట్టి నభోంతరాళమున పోవుచున్నవి. ప్రకృతి నంతయు భయంకరమగు నిశ్శబ్ద మావరించినది. అది శాంతిగాదు. తుపాను గలుగుటకు ముందు సముద్రగర్భమున నోచు నిశ్శబ్దమువంటిది.

కుమార తిమ్మరాజు బదిమైళ్ళలోఁ బ్రయాణించుచున్నాడన్నవార్త మహామంత్రులకు దెలిసినది. వారి యానందము వర్ణింప సాధ్యముగాదు. ఆ వార్తను వారు దేవరాయల కెఱుక పఱచినారు.

బంగారు తిమ్మరాజు వచ్చు వార్త మహారాజులకును సంతోషకరమే. వారి యానతితో నమాత్యులు కుమారు నెదుర్కొనుటకై సైన్యమును బంపినారు. ఆసేన యింకను దిమ్మరాజు సేనను గలిసికొనలేదు. కాని యొకవైపు దిమ్మరాజు సేనల హయఖురారభటి, మఱియొకవైపు వాని నెదుర్కొనవచ్చు నమాత్య ప్రేషితసైన్యమునందలి గుఱ్ఱ

ముల డెక్కల చప్పుడులు - నీ రెంటితో నా పరిసర ప్రాంత మంతయు మద్దెల మ్రోతయై పోయినది.

వచ్చి వచ్చి తిమ్మరాజు సైన్యము లోకలోయను దఱిసినవి. దాని నుత్తరించినచో వారు ఘనగిరికిఁ జేరుకొన్న టులే. ఆ లోయకు గొంత దూరమున సురగిరికొండలు ప్రకాశించుచుండెను. ఆ కొండలు వరుసలు వరుసలై యున్నవి. వాని కొమ్ములా యపరిణతాంధకారమును భేదించుకొనుచు నాకాశమును దూసికొనుచున్నవి.

ముందుగాఁ దిమ్మరాజు పదాతిసైన్యము లోయలో ప్రవేశించి సాగిపోయెను. నికుంజములనుండి రాళ్లుబడ నారంభించినవి. హఠాత్తుగ గలిగిన యీ పరిణామములో తిమ్మరాజు హయసైనికులు గాసంత చకితులైనారు.

అంతట నొకడు "హుమ్మని" ముందుకు దూకినాడు. ఆ దూకినవాడు మేఖలాదేవి యంపిన సేనాధిపతియే. అతడు దిమ్మరాజు హయమునకు ముందు నిలచి, కరవాలమును త్రిప్పుచు నొక ఱాయికూడ బంగారు దిమ్మరాజును దాక కుండ జేయుచుండెను. ఇంతలో నికుంజగర్భములలోనుండి బారులు బారులుగ గుఱ్ఱముల రౌతులు వీరిపై పడిరి. సంకుల సమర మారంభమయ్యెను.

ముందున్న పాదాతిసేనను వీరితోఁ జేరనీయక ప్రక్కనున్న శిలల సందులనుండి, బొదలనుండి యీటెలవారువచ్చి వారిపైఁ దలపడినారు. పోరు ఘోరమైపోయినది.

బంగారు తిమ్మరాజున కీయుదంతమేమియు నర్థము గా లేదు. మహామాత్యులేరి? ఇది యెవరి సైన్యము?సవరము నారప్పదే యైయుండుననియువరాజూహించికొన్నాడు. కాని యీ సవరము నారప్ప గనపడదేమి? ఇవి యన్నియు నాతని యెదలో బారాడుచున్న యూహాలు. కాని యపుడు జరుగు చున్నది యుద్ధము. ఆయోధనరంగమున నాలోచన లేమి! తిమ్మరాయండు గత్తిదూసి ప్రత్యర్థులపై బడినాండు. ఆతని ననుసరించియో మేలలాచేసి యంపిన సేనాధిపతి బోరు చుండెను.

ఇంతలో "రివ్వు" మని తిమ్మరాయలకు వెనుక పాటునుండి యొక బాణము వచ్చినది. ఆ బాణము సరిగం దిమ్మరాజుపై గురిపెట్టబడినది. మేల సేనాధిపతి దానిని జూచి నడుమనే గత్తితో ఖండించివేసినాడు. అది దాకి యున్న దిమ్మరాజు గతించెడివాండే. దాని వెనువెంటనే మఱియొక బాణము వచ్చినది. మొదటిబాణమునుఖండించు యత్నముననున్న సేనాధిపతి దానిని గమనింపలేదు. అది సరిగావచ్చి యీ సేనాధిపతి వీపున దూరి వక్షమును దూసి వెడలిపోయెను. దానితో నజసొమ్మసిల్లిన సేనాధిపతి వెను దిరుగులోపల మఱియొక శరమువచ్చి వెన్నున నాటినది. దానితో నా సేనాధిపతి హయమునుండి యరచుచు గ్రిందం బడినాండు. ఆ యరపున నపుడు స్త్రీత్వముండినది.

ఇంతలో నల్లంత దూరమున ధూళి యాకసమున కంటినది. ఆ ధూళిపటలము గనపడినంతనే యంతవరకు

యుద్ధమొనరించుచున్న దిమ్మరాజు ప్రత్యర్థులు చెట్టున కొకఁడు మాయమైపోయినారు. ఆ లోయలో దొంగ త్రోవ లన్నియు వారికిఁ బరిచితములు. ఒక్కనిమేషమున వారియం గాక మనుష్యుని పోలకువగూడఁ గనబడలేదు.

బంగారు తిమ్మరాజు సైనికులు కాగడాలు వెలిగిం చిరి. వాని వెలుగున దిమ్మరాజు హయమునుండి క్రిందఁ బడిన సేనాధిపతిని సమీపించినాఁడు. అది వానికి ప్రాణో త్క్రమణకాలము. దిమ్మరాజును చూచినంతనే మరణా వేశమునవున్న సేనాధిపతి నవ్వినాఁడు. వాఁ డిట్లనెను. "యువరాజా! నేను సుమలాదేవి పరిచారికను. మదనికను. అమ్మగారిమాట దక్కించితిని. ఇక సెలవు."

"ఏమీ! నీవు మదనికవా! ఎంత త్యాగము జేసితివి?" తిమ్మరా జాశ్చర్యపడెను. వెంటనే యతని కన్నులనిండ నీరు నిలచినది.

మదనిక ప్రాణములు బోవుచున్నవి. ప్రాణోత్క్రమణ కాలమున మఱియొకసారి యామె "మేఖలా" యన్నది.

ఇంతలో నమాత్యులు పంపిన సైన్యము వీరిలోవచ్చి కలసెను. జరిగిన గాథ యంతయు వారికిఁ దిమ్మరాజుగారు వివరించినారు. అది సవరము నారప్ప పంపిన సైన్యమే యయి యుండునని వా రేకాభిప్రాయమున వెల్లడించిరి. అందరును గలసి రాజధానికిఁ బయనమైనారు. కాని దిమ్మ రాజుగారి మనస్సేమియు సరిగాలేదు. వారి హృదయమున త్యాగమూర్తియైన మదనిక రూపే మెదలుచుండెను.

భావగోపనము:

దూరమున నద్దుదారులఁబడి యిరువురు రౌతులు శరవేగమున స్వారిజేయుచున్నారు. వారు పోవుచున్నది రాజధానికి.

"జగ్గరాజా! ఆ బాణపుదెబ్బతోఁ దిమ్మరాజు మడిసి యుండెడివాఁడే. నడుమ నెవరో యడ్డుదూకిరి. వారు నా బాణముల కాహుతియైరి."

"నారపరాజుగారూ! తమ శరసంధానపాండిత్యము, లక్ష్యశుద్ధియు మఱెవ్వరికిని రావు. ఆ గ్రుడ్డిచీకటిలో లక్ష్యముపై నంత సరిగ గుఱిపెట్టగలిగిన మీరు నాదృష్టికి నిజముగా నర్జునులే."

సవరము నారప్ప నిట్టూర్చెను. "ఏమైననేమి! నా యత్నమంతయు మీరు చేరలేదు." ఇవి యతడన్న మాటలు. వారు రాజధానిని దఱిసినారు. ప్రధానద్వారమున నూరిలోనికి వారు ప్రవేశింపలేదు. ఆ త్రోవలే వేఱు.

సవరము నారప్ప యొనరించిన యీ హత్యాప్రయత్నము ఎక్కువ బహుళముగ బయటికి రాకనేలేదు.

కోటను బ్రవేశించుచున్న తిమ్మరాజునకు దేవరాయ లెదురువచ్చిరి. వారితోఁబాటు మహామాత్యులుగూడ నున్నారు. ఆ యిరువురితో నగరిలోని ప్రధాన రాజబంధువులును నుండిరి. ఆ బంధుకోటిలో సవరము నారప్ప యొకఁడు సవరము నారప్ప బరమాదరమున దిమ్మరాజు నాహ్వానించెను. వాని భావగోపనము దుర్ఘటమైనది. మహామాత్యులకుఁ

ద్రోవలో జరిగిన దురంత మప్పుడే తెలిసినది. వారు వేయి గన్నులతో దిమ్మరాజును గనిపెట్టుచున్నారు.

అమాత్యుల పక్షపు సేనానాయకుల కిప్పుడు పెక్కులు వచ్చినటులైనది. బంగారు తిమ్మరాజుగారి నివాసము రత్నవతీ దేవి భవనమందే. తిమ్మరాజును గాంచినంతనే రత్నవతీదేవి కడుపు చెరువుగా నేడ్చినది. ఆమెతో గూడ దిమ్మరాజుగారు గూడ నేడ్చిరి. కడకన్నారు: "అమ్మా! జీవితము సుఖదుఃఖ సంకలితము. ముఖ్యముగ నీసేవ చేయుటకే నే నింత దూరము వచ్చినది. కొన్నిదినములలోపలికి క్షేమము. రాజధాని యందలి కంటకము లన్నిటిని తొలగించెను. పెద్దనాయన గారి మనసు మారితీరును."

దేవరాయని యుబుసెత్తినంతనే రత్నవతీ దుఃఖము గట్టలు పొంగివచ్చినది. "ఏమి చెప్పుదును నాయనా! వారిపుడు నావైపె కనులెత్తి చూచుటలేదు. అట్లున్న వారిట్లగుదురని యూహించుకొని యున్నచో రెండవ సంబంధ మున కంగీకరించియే యుండను. నా విషయ మెట్లున్నను రాజ్యమునందు సవరము నారప్ప మహాప్రబలుండై పోవుచున్నాడు. రంగాదేవి కొకవేళ గొడుకుగల్గిన వానికైనను రాజ్యము నారప్ప దక్కనిచ్చునో లేదో?" రత్నవతీదేవి పలికెను.

"అమ్మా! పిన్నమ్మ రంగాదేవిగారికి సుతప్రాప్తి యైనచో వారు సింహాసనమునకువచ్చుటలో నెవరికిని విప్రతి

మొక్కఁవో నివ్వక సమర్థుఁడవై ప్రజల మనుపుచుండుము. ఇంతలో రంగాదేవి గర్భమున నీకొక తమ్ముఁడు బుట్టిన-'' మది నిట్టూర్పులలో నాపలుకు లిమిడిపోయినవి. దేవరాయలు జాలిగా రంగాదేవివైపు జూచిరి. ఆమె యేభావమునో జూపులు నేలకు వంచినది. తిమ్మరాజుగా రందికొన్నారు: ''అవునవును. మేమందఱ మాయదృష్టమునకు గాచికొన్నాము. నా కెప్పుడెప్పుడు దమ్ముని ముఖారవిందమును జూతునా యను నాస గొండంతయున్నది.'' మఱి కొంతసే పిష్టాగోష్ఠి జరిగెను. తిమ్మరాజు రత్నవతీదేవి భవనమునకు వచ్చివేసిరి.

మఱుదినమున నాఁడు రాజుల కొలువు నిర్విఘ్నముగా సాగుచున్నది. దేవరాయలు మహామాత్యులను బిలచి తామింకఁ గొలువునకు రాలేమనియు సర్వ వ్యవహారములును దిమ్మరాజులతోనే జరుపుకొనవలెననియు నత్యావసర కార్యములలో మాత్రము దన్ను గలసికొనవలెననియు నాజ్ఞ పెట్టినారు.

అమాత్యులు మనవిచేసినారు: ''మహారాజా! దామేమో దిన్నగ విశ్రాంతి గైకొనుచున్నారు. తమ యంసముతోఁబాటు నా మేధగూడ ముసలిదైనది. అమాత్యపదవి నుండి విరమించి నేను విశ్రాంతి......''

దేవరాయలు దిన్నగ నవ్వినారు. ''కానిండు. అట్లే చేయవచ్చును. దేవేంద్రుఁడు విశ్రాంతి గైకొన్నను జెల్లును గాని బృహస్పతి యూరకున్న నెట్లు? నా సమస్య యేదో యొకరీతి దేలినచో దొందరలోనే దిమ్మరాజు పట్టాభిషేక

నిర్ణయమునకుఁ గొంత మాఱుఁ దలఁపున్నది. అంతవఱకైనను దమ రీభార మీాదవలసినదే.''

తిమ్మరాయలకు సింహాసనము ప్రక్కలో నొక జఱు గద్దె యేర్పాటు సేయఁబడినది. అతఁడు గొలువున గూరు చున్నపుడు ప్రశాంత గంభీరమూర్తియై యుండును. ముసలి సరదారు లాతని జూచి యౌవనమున నుండిన దేవరాయలను స్మరించుచుండిరి. సైనికోద్యోగుల కాతడన్న నమితగౌర వము, భీతియుఁగూడ. తిమ్మరాజు ప్రక్కన ముసలిసింగమువలె మహామాత్యులు గూరుచుండెడివారు. సవరము నారప్ప యొక జంబుకమువలె దూరముగ నక్కియుండును. వాని యాశ్రితులున్న పొలకువలే తెలియుట లేదు.

ప్రజలకుఁ దిమ్మరాజన్న దంత్రియైనాఁడు. ప్రతి మన వియు శ్రద్ధతో నాతఁడు వినును. వినుటయే గాదు. వెంటనే వారి కనుకూలములు గలిగించును. ఏకాలముననైనను నెవ్వరైనను రాజకుమారుని దగ్గరకేగి మనవి జెప్పికొన వచ్చును. వాని నెవ్వరు నడ్డగింపరాదు. కాని వాని మనవి వినునపుడు రాజువెంట నిరువు రంగరక్షకు లుందురు. అది యునుగూడ - సవరము నారప్ప కుట్రలెక్కువగా నున్నవి. గనుకనే రాత్రియంతయు గుఱ్ఱముపై స్వారిఁజేయుచుఁ దళ వరులతోఁ బాటు యువరాజును దిరుగును. ఏప్రాంతములందు గాని పీసము దొంగతనము జరగుటకు వీలులేదు. రాజధానికి వచ్చిన యల్పకాలముననే యువరాజు రహస్యద్వారము లన్నియు గమనించి కాపు నెట్టించెను. సవరము నారప్ప

పనియేమియు సాగుటలేదు. సరదారుల నందరిని నయమున భయమున-నాదరమున యువరాజు దనవైపుద్రిప్పికొన్నాడు. ప్రతిదినమును మహామాత్యులును, యువరాజును రహస్య భవనమున గలిసికొనుచుండిరి. అపుడపుడు దేవరాయఁడును రహస్యభవనమున కేతెంచెడివాఁడు.

తిమ్మరాయఁడు రాజధానికి వచ్చిన కొన్నిదినముల నుండి యా దేవరాయల చిత్తవృత్తి రత్నవతీదేవియందేమో మారినది. వారు దినమున కొకసారి రత్నవతి మేడకు నరుగుదెంచెడివారు. ఆ వార్తలు క్రమముగ బయటికి విన వచ్చెను. ప్రజలలో గొందఱు దిమ్మరాజును జూచిన రాజునకు నిగూఢముగ భయమనిరి. కొందఱు కామాంధకారము యొక్క ముమ్మరము దగ్గిన దనిరి. మఱికొందఱు దనకు సంతానము గలుగుననునాశ దేవరాయలకు నిరాశయైన దనిరి. వేఱుకొందరు దైవైక నిబద్ధబుద్ధులు రత్నవతీదేవి దుష్కర్మ నశించిన దన్నారు. దైవజ్ఞులు దాము జేసిన యుపాసనలు ఫలించి యీమెకు ఫలించిన దనిరి. ఎటులైన నేమి-రత్నవతి దినములు మరల వికసించినవి. ఈవార్తలు విని లోలోన గుమిలి చచ్చినవా డొకఁడే. నవరము నారప్ప. ఒకనాడు రంగాదేవి మేడయందీ సంభాషణము సాగుచుండినది. ఎవ్వరికినిగాదు-అన్న చెల్లెండ్రకే.

"చెల్లెలా! నా యత్నము లేమియు సాగివచ్చునట్లు లేదు. వ్రేలెడంత యీ తిమ్మరాజు గాలరుద్రుడుగ నున్నాఁడు."

"నాకును నట్లే దోచుచున్నది. సింహాసనము వానికి సంక్రమించినచో నిక మన కాయువు మూడినట్లే. ఒక పని చేయుదము. నే నిక కొన్నిదినములనుండి గర్భవతినైనట్లు నటింతును."

"నీవు చెప్పు మాట నాకర్థమైనది లెమ్ము. ఎక్కడ నుండియైన నొక మగపిల్లవానిని దెచ్చి నీకడ జేర్చుమందువు. అది యసాధ్యము. పైగా నగరమునందలి యన్ని రహస్య ద్వారములను దిమ్మరాజు సైనికులు రేపగలు గాచుచుందురు. చెల్లెలా! ఎవరినో పరాయివానిని దెచ్చి రాజ్యమున నుంచుట కంటెను నీ మేనల్లునే యెందుకు రాజ్యమున కెక్కింపగూడదు?" ఈ ప్రశ్న వేయుచునే సవరము నారప్ప చెల్లెలిని వెక్కిరించుచున్నవానివలె దనలో దాను నవ్వుకొన్నాడు. ఈ ప్రశ్న విన్నంతనే రంగాదేవి పెదవి దనంతనే విఱచికొన్నది. ఆమెకు నారప్ప సంతానమును సింహాసనముపై నుంచుట కిష్టమున్నట్లగుపడదు. అపుడు దన వదినె పెత్తనమెక్కువయై తనస్థితి దుర్భరమగునని యామె యెఱుగును. ఆమె యన్నది - "అన్నయ్యా! బంగారు తిమ్మరాజే గద్దె నెక్కనిమ్ము. మన కేమి కష్టము వచ్చినది? ఎటులైనను సింహాసనమునకు వాడే వారసుడుగదా?"

సవరము నారప్ప పకపక నవ్వెను. "పిచ్చిదానా! నీ వీప్రపంచమున నెట్లు బ్రదికెదవో దెలియదు. తిమ్మరాజు రాజధాని కడుగు పెట్టినంతనే బావలో నేమార్పు వచ్చినదో నీవు గన్నులార జూచుచునే యున్నావు. ఇంతకుముందు

రత్నవతీ దేవిని బుష్టీకరింపనివాఁడు నేఁడు దినమును బోయి కొలువుసేసి వచ్చుచున్నాఁడు. ఇక గొన్నిదినముల కాతఁడక్కడనే మఱగుననుకొమ్ము. అపుడు నీకును నిన్ను నమ్మి కొన్న నాకును దిక్కెవ్వరు? రత్నవతీదేవికి నీపైన గుఱ్ఱ లేదందువా? ఇన్ని దినములును నామె యాటలు సాగి వచ్చుటలేదు గనుక నట్లుండెను. దేవరాయలు మఱల దన మాటలకు దలనూప నారంభించినంతనే యామె నీపైఁ బితూరీలు మొదలు పెట్టును. బాగుగా నాలోచించి కొమ్ము.''

''అయిన నన్నేమి చేయుమందువు?''

''ఎన్నిరీతుల జూచినను దిమ్మరాజు బ్రతికియుండగా మనకు దిక్కులేదు. మొదటి కంటకమును నాశనము చేయవలయును. తరువాత రాజ్యాధికార విషయమున నిన్ను గాదని పోవు క్రొత్తవారిం దెవ్వరున్నారు? ఈ కార్యమును సాధించుటకు నేను జెప్పినట్లు నీవు దూచా దప్పక నడచి కొనుటయే దప్ప వేఱుమార్గము లేదు.''

''అట్లే సేయుదును.''

''నే నిక వెళ్ళుదును. మన మిట నేకాంతముగఁ జాలసేపు బ్రొద్దుపుచ్చరాదు. మన దినములు చాల ఘోరముగ నున్నవి.'' ఆభూగర్భద్వారమునుండి నారప్ప బయటికి నిర్గమించెను. ఎక్కడ దేలెనో వానికే యెఱుక.

దురూహ :

కొన్ని నెలలట్లే గడచినవి. అప్పుడప్పుడు నారప్పయు, రంగాదేవియు భూగర్భమున గలిసి కార్యములు నిర్ణయించికొనెడివారు. మహామంత్రులును, తిమ్మరాజును గలసి రహస్యమందిరమున ప్రతిదినమును జర్చించికొనెడివారు. దేవరాయలును, రత్నవతీదేవియు రోజును బురాణశ్రవణ మొనరించెడివారు. వారి పురాణశ్రవణము రంగాదేవికి శూలపుఁ బోటైపోయెను. సవరము నారప్పయు, మహామాత్యులును నెత్తుపై నెత్తు వేసికొనుచున్నారు. దేవరాయల యష్టమంత్రులలో నొక యిద్దరు నారప్ప బోధకు దల వ్రేలవేసినారు.

రత్నవతీదేవి నగరులో స్కాంద పురాణ శ్రవణము సాగుచుండెను. కాశీవర్ణనాఘట్టము వర్ణింపబడుచున్నది. ఆ సందర్భము వివరింపఁబడునంత మేరకు దేవరాయలేమో శిలాప్రతిమవలె గదలక మెదలక వినుచున్నారు. ఆనాఁడు వారికిఁ గాశీయాత్రకై యూహపోయినది.

తరువాతి దినమున రంగాదేవి భవనమున వారుండిరి. దేవరాయలు దేవేరితో ననిరి : "ప్రియా! వారణాసి దర్శనము సేయవలెననెడి యూహ దినదినమునకుఁ దీవ్రమైపోవుచున్నది. త్వరలోనే ప్రయాణము గట్టనున్నాను. నీవును, నేనును, రత్నవతీదేవియుఁ జేరి కాశీవిశ్వనాథున కేటికోళ్ళు గావించినచో మీ యిర్వురిలో నెవ్వరికైనను సంతానము

గలుగు నను నాశయున్నది'' రంగాదేవి ముఖభంగిమ లం దేమియు మార్పులేదు. ఆమె మనవిసేసెను.

''మహారాజా! నాకిపుడు సంతానము గావలెనను కోర్కియేలేదు. బంగారు తిమ్మరాజే నాసుతనిర్విశేషుం డనుకొన్నాను. ప్రాప్తమున లేనిది పదివేల తీర్థముల మునింగి నను లాభములేదు. ఇంతకును నొకవేళ నదృష్టముండి యక్క రత్నవతీదేవి కడుపున నొక కాయంగాచినను నా యానందమునకు మేరయుండదు.''

''అయిన కాశీప్రయాణమున నా వెంట నీవు రావన్న మాట.''

''రమ్మని నిర్బంధించినచో రాక యేమిసేయుదును? నా అభిప్రాయమును మనవిసేసితి నంతే. పైగా సందరు రాజధానియందు లేకుండంబోవుట యిప్పటి స్థితులలో క్షేమ కరమును గాదు. నాకేమో యూరు విడువవలెననిన భయ మగును.''

''బేలా! యేల యిట్లు మాటాడెదవు? యువరాజు తిమ్మరాజు జనానురంజకుండై యున్నాడు. పైగా మహా మాత్యుల మేధాశక్తి వేయిగన్నులతో సామ్రాజ్యమును సంరక్షించుచున్నది. మీ యన్న నారప్ప దన బాహు దండముతో రాజ్యక్షేమమును భరించుచునే యుండును.''

''నేనుం జెప్పవచ్చినదియు నదియే. లక్ష్మి చాల చంచలము. ఆమె కటాక్షమును శాశ్వతముగాం బొందిన వారెవ్వరునులేరు. ఈ రాజ్యాశలలో నన్నలులేరు, తమ్ములు

లేరు—ఇతరు లే బాంధవులును లేరు.'' ఈమాటలనుచున్న పుడు రంగాదేవి మనస్సున నెన్నియో భావములు మెదలినవి. వారిలో దేవరాయలను మోసగించు నొక దలంపును విలీనమై యుండినది.

అమాయకుఁడగు దేవరాయలకు రంగాదేవి యొక దేవత యనిపించినది. ఇంతకు ముందెన్నఁడు నింత గొప్ప తన మామెలో నాతని కర్థముగాలేదు.

మరికొన్ని దినములకు దేవరాయలు గాశీనగరమునకు ప్రయాణమైనాఁడు. వెంట రత్నవతీదేవి మాత్రమే యుండినది. సామ్రాజ్యక్షేమమునకై మహామాత్యులు రాజధాని యందే నిలిచిరి.

కాశీకిఁ ప్రయాణమైన దేవరాయలను సాగనంపుట కమాత్య గ్రామమంతయు వచ్చినది. సవరము నారప్పయు నరుదెంచినాఁడు. లెక్కిన సామంతు లందరు వచ్చిరి. ప్రయాణోన్ముఖుఁడైన పెత్తండ్రికిఁ దిమ్మరాయఁడు వినయముగ నమస్కరించి యాశీర్వాదము లందినాఁడు.

దేవరాయలవెంట కొంత సేనయుండెను. అవసరములగు నాహారపదార్థములన్నియు నంచెలపై ముందే సాగిపోయినవి. మేనాలో వచ్చిన రంగాదేవి మహారాజులను పల్లకిలోని కాహ్వానించి నమస్కరించెను. ఆమెచే నమస్కారమందుట మహారాజున కేమో ఘనత యనిపించెను. కొన్ని దినములకు ముం దామె యాడిన మాటలలోని సౌరభ్య

మెంతగా నాతని హృదయమును లోగొన్నది! ఇంతకు నది రంగాదేవి వంచనా కౌశల్యమే గాని వేఱుగాదు.

దేవరాయలు కనుచూపు మేర దాటిపోవు గోలం దినను సవరము నారప్ప హృదయమేదో యానందమున బొంగులుపోయినది. ఘనగిరిసామ్రాజ్యలక్ష్మి దన కభిముఖయై నడచివచ్చుచున్నట్లాతనికి దోచెను. దేవరాయని ప్రయాణమునకుం దన రాజ్యాక్రమణమునకు నేమి సంబంధమో!!

దేవరాయలుబోయి సుమా రొక నెలకావచ్చెను. ఈ నెలలో రెండుమూడుసారులు నన్నయుం జెల్లెలును భూగర్భగృహమునం గలిసి మాటాడుకొన్నారు. ఆమాటలుం జాల మెల్లగా నుండెను. వాని సారాంశ మా యిరువురకే యెఱుక. సవరము నారప్ప చేష్టలు మహామంత్రులు సాక్ష్యమైనంతవరకు గనిపెట్టుచునే యుండిరి. కాని వాని కౌటిల్య దక్షత యమేయము; అసమానము.

ఒకానొకనాడు ఒకరాతుడు శరవేగమున నరణ్యములలోం బయనించుచున్నాడు. కడిదేశములుం దాటినను వాడు బలుమాఱు వెనుదిరిగి చూచుచునే యుండెను. పోయిపోయి యా రాతుడు గాశీనగర సమీపమున బయనించు దేవరాయలను గలిసికొనెను. వాడు దేవరాయలను సమీపించి ఈ మాటలన్నాడు.

"మహారాజా! మహారాణి రంగాదేవిగారు నన్ను నంపినారు. అది మీ కేకాంతమునం దిమ్మని వారి యాజ్ఞ.

దేవరాయలు వాని కేకాంతమున గుడారమున దరిసెన మిచ్చిరి. రంగాదేవిగా రంపిన గమ్మయం దిటులున్నది.

"మహారాజా! నాయట్టి యభాగ్యురాలు ప్రపంచమున నుండదు. మిమ్ము జేపట్టి యిహపరములకు రెంటికిని దూరమగు స్థితి ప్రాప్తించినది నాకు. నే నానాడే మీతో నంటిని—యెవ రెవరి కేసమయమున నేమి బుద్ధులుపుట్టునో యని. అనుకొన్నంత పనియును జరిగినది.

నేను వానిని మామూలుగనే నగరికి రానిచ్చితిని. సుహృద్విశేషముగనే చూచితిని. కాని దైవము దప్పదలంచెను. వాడు కామదృష్టితో నన్ను బట్టవచ్చినాడు. ఈ మాటలు మీకు వ్రాయుటకు నాకెంతో జాల సిగ్గుగానున్నది. మీరు వచ్చులోననే నేనీ యిహలోకము వీడెదను.

ఇట్లు మీ పాదదాసి,
రంగాదేవి"

దేవరాయల ముఖము వివర్ణమై పోయెను. వా రా రాత్రియేను వెళ్ళిపొమ్మనిరి. ఈ జాబులోని విషయములు వారు రత్నవతీదేవికి దెలుపలేదు. ఆమె శీలమునుగూడ దేవరాయం డాశంకించెను. మహామాత్యులపై దేవరాయలకు మనసు జెడినది. రంగాసానిపై మాత్రము వారి కొక విశ్వాసము గాదు కొనిపోయినది. ఆమె యానా డాడినమాటల మాహాత్మ్య,

మంతటిది. ఆ రాత్రియంతయు దేవరాయలు గుడారమున గుమిలిగుమిలి యేడ్చుచుండెను.

మఱి రెండుదినముల కింకొక రౌతువచ్చి రాజునకు వేఱొక జాబు నిచ్చినాఁడు. అందిట్లున్నది:

“మహారాజా! తిమ్మరాజు దౌర్జన్యము మితి మీఱినది. నేను నిలువలేను.

రంగాదేవి”

ఇది యామె వ్రాసినదో కాదో యని దేవరాయ లాలోచించిరి. స్పష్టముగ నా కమ్మపై రంగాదేవి వ్రాలున్నది. నమ్మకపోవు టెట్లు?

దేవరాయ లిక దాళలేరు. వారికి దుఃఖకోపములలో జ్ఞానము నశించెను. వెంటనే రంగాదేవి పేర నొక కమ్మ వ్రాసినారు. ఆ కమ్మను గైకొని యారౌతు వెడలిపోయెను. దానియం దిట్లు వ్రాయఁబడినది.

“ఈ కమ్మ చేరిన వెంటనే సవరము నారప్ప యెవ్వరడ్డుపడినను జంకక తిమ్మరాజు దల నఱుకవలెను. ఈ ప్రయత్నమున కడ్డుపడువారందఱు రాజద్రోహులక్రిందఁ బరిగణింపఁబడుదురు. ఇది రాజాజ్ఞ.

దేవరాయల వ్రాలు”

ఆ జాబును రంగాదేవి యది వచ్చిననాటి రాత్రియే యన్నకు చూపినది. సవరము నారప్ప సంతోషమునకు

మేరయే లేదు. మరుదినము ప్రాతఃకాలమున దనకు గావల సిన సైన్యాధిపతులతో నాతఁ డాలోచించెను. అందఱును దానిని బలుపఱుప నంగీకరించిరి. ఇరువురు మంత్రులుగూడ “వల్లె” యన్నారు.

నాటి మధ్యాహ్నము గొలువుదీరెను. మహామంత్రులు దిమ్మరాజాసనమున కెడమవైపున నధివసించియుండిరి. తక్కిన మంత్రు లందఱు గూర్చునున్నారు. మహావీరులు గొలువున వారి మీసములు మెలిపెట్టి - కత్తుల నాటి కూర్చొని యున్నారు. తన యుచితస్థానమునుండి సవరము నారప్ప లేచి యనెను: “ఈ తిమ్మరాజు మహాద్రోహి. మాతనేబట్ట వచ్చిన పాపి. ఇతని దొంగతనమంతయు నేటికి దెలిసినది. రంగాదేవియే స్వయముగా రాజుతో నివేదించుకొన్నది. ఇదిగో వీని తల నఱకుమని రాజాజ్ఞ. ఇది నిన్న నేవచ్చినది. ఈ ప్రయత్నమున కడ్డుపడు వారందఱు రాజద్రోహులనియు నందున్నది. మఱి మహామాత్యా లేమందురో!” నారప్ప పకపకమని వికటాట్టహాసముఁ జేసినాఁడు.

“ఛీ! నీచా! నోరు మూయుము. ఇదియంతయు నీ కుట్ర. తిమ్మరాజు మాతృద్రోహము గావించునన్న నీ నాలుక బదివేలుగా జీలిపోవును.” మహామంత్రు లాసనముపై నుండి లేచినారు.

“మీరుకూడ రాజ్యాశతో నీ కుట్రయం దెందులకుఁ జేరియుండగూడదు? తిమ్మరాజు శీలముపై మీకంతటి

విశ్వాసమెట్లు గలిగినది?'' ఒక మంత్రి ప్రధానామాత్యుల కెదురు దిరిగినాఁడు.

ఆ మంత్రిని ''నోరు మూయు'' మని యొక సామంతుఁడు గద్దించినాఁడు. ఇంతలోఁ దెర వెనుకనుండి రంగాదేవి గొంతు వినబడినది: ''తిమ్మరాజు నన్ను బట్టవచ్చిన మాట సత్యము. నేను మహారాజులకు మనవి సేసినది నిజమే. ఆ మాతృద్రోహి దలనఅకుడు. మహామంత్రికూడ రాజ్యాశచే నీకుట్రలో జేరి తిమ్మరాజును నాపై నుసికొల్పినమాట బరమ వాస్తవము.''

ప్రతిఫలము:

రంగాదేవి ప్రళయ కంఠగర్జారవములతో బది వేల కత్తులు దిమ్మరాజు రక్తమానుటకై జుర్రుమని లేచినవి. దానాపుటకై పదివేల కత్తులు దలలెత్తినవి. ఈసవ్వడిలో మహామాత్యుల కనుసైగతో దిమ్మరాజును గొందఱాశ్రితులటనుండి దరలించినారు. వారు హాస్సేన్, హుస్సేన్ ప్రభృతులు.

త్రోడెనాగు దూకినట్లు సవరము నారప్ప మహామాత్యులపై దూకి బాకున బొడిచెను. ఆ పోటునకు మహామాత్యుల ముసలిప్రాణము శరీరమును విడచినది. ఆ బాకును మరల బయటికి కీడ్చుట యసాధ్యమయ్యెను. ఆ పోటులోని లోతంతటిది. అమాత్యసైనికులు దెప్పరిల్లులోన నారప్ప యటలేదు. ఆ గుంపునుండి బయటపడి తన పక్షమును బయటికి రాఁ బిలిచెను.

తిమ్మరాజు ప్రాసాదమున సభదీరినది. హాస్సేన్, హుస్సేన్ లిఱువురు యువరాజున కిరువైపుల నుండిరి. బంగారు తిమ్మరాజు ముఖము కళాహీనమై యుండెను.

"నాయొకని కొఱకింత రక్త పాతము లెందులకు? మాతృద్రోహి యనిపించుకొన్న యధమప్రాణి మరణించుటయే మంచిది."

ఒక సామంతుఁ డన్నాఁడు: "కాదు యువరాజా! మహారాజులు వచ్చునంతవఱకై నదమరుబ్రదికియుండవలెను. నిదానముగా దానిలోని నిజము తేలును."

ఒకసారి యపకీర్తి కళంకితమైన చరిత్రమున వేయి నిజములు దేలి యేమి ప్రయోజనము?

ఇంతలో బయటినుండి యొక సైనికుఁ డరచుచు వచ్చెను. "యువరాజా! సవరము నారప్ప మహామాత్యులను బొడిచి చంపెను. నారప్ప పక్షమువారు ప్రాసాదమును ముట్టడింప వచ్చుచున్నారు." తిమ్మరాజు కెవ్వుమని యఱచి నేలగూలినాఁడు.

ప్రాసాదమును సవరము నారప్ప సైన్యము ముట్టడించినది. తిమ్మరాజు భవనముననున్న వారైదునూర్లకు మాత్రమే. ఇక నాలోచనల కవకాశమే లేదు. ఒక నూరు మంది కత్తుల వారిని దిమ్మరాజునకు గాపుంచినారు. మిగిలిన నన్నూరుమందితో హాస్సేన్ ముందుకు దూకినాడు. అతని వెంటనే హుస్సేన్ దూకెను.

బయట నున్నది వేలకు సైన్యము. ఆ యిర్వురు మహావీరు లాసైన్యసాగరమును వధించివేసిరి. వారికి గుఱ్ఱములుగూడ లేవు. చేతనున్న కత్తులొక్కటే యీ మహావీరుల యాయుధములు. ఆ కత్తి పోయిన మీరు కత్తి గూడ లేదు.

వారు శౌర్యరసపుంభావరూపములై విహరించిరి. విహరించి విహరించి యుద్ధమున నిద్రవోయిరి. భారతమున నభిమన్యునివలెనే పోరిపోరి యలసిన వారి నిర్వుర ననేక యోధులు చుట్టుముట్టి చంపిరి.

నవరము నారప్ప గొంత సైన్యముతోఁ బ్రాసాదమును బ్రవేశించినాఁడు. అప్పుడప్పుడే మూర్ఛనుండి దెప్పరిల్లిన తిమ్మరాజు నారప్పనుగనినంతనే గ్రోల్పులియైముందుకు దూకెను. వారిర్వురకును జరిగిన యుద్ధము వర్ణనాతీతము. కాని జయలక్ష్మి నారప్పనే వలచినది. వాఁడేమఱుపాటున నున్న తిమ్మరాజు డొక్కలోనికి బాకు దూర్చినాఁడు. ముందే యనుత్సాహ దిగ్ధుడైన తిమ్మరాజు నేలకొఱఁగెను. ఒఱిగిన వానిపై నారప్ప మఱియొక బాకుపోటు పొడిచెను. ఆపోటు యువరాజు ప్రాణము లూడ్చినది. తానెక్కనున్న సింహాసనమంతమేర యువరాజురక్తము చిందెను. ఆ రక్తముపై కౌటిల్య పిశాచి నారప్ప యానందమున రవ్వంతసేపు నాట్యమాడినాఁడు.

అది రాత్రి. నారప్ప బాకుపట్టుకొని రంగాదేవి భవనమును బ్రవేశించెను. ఆమె యపుడు నిద్రించుచున్నది. ఆమె

నాతడు భూగర్భగృహమునకుఁ బిలచినాడు. అన్న వెంట నామె గలవలె నడచి వెళ్లెను. నారప్ప వాలక మానాఁడు ఘోరముగ నున్నది. రంగాదేవి కెందుకో చెప్పరాని భయమైనది.

రహస్యభవనమును ప్రవేశించినంతనే నారప్ప గవకవ నవ్వినాఁడు. రంగాదేవి యనుకుకుంపెతో లేని నవ్వు దెచ్చుకొని.

"అన్నా! ఇక మన కార్యమంతయు నెఱవేఱినట్లే" యన్నది.

నారప్ప మరల పికపిక నవ్వినాఁడు.

"అవునవును. ఇఁకను కొంత మిగిలినది. అందులకే వచ్చినాను. నీ యుపకారమునకు బ్రత్యుపకృతి యీవలెను."

"అదియేమి! యట్లనుచున్నావు?"

"ఇంకేమి యనవలెను! నీవు భర్త కెగ్గు దలఁచిన నీచురాలవు. అధర్మమునకు వెఱవక కుమారునిపై నింద వేసిన యధమజాతివి. ఇట్టి దానివి రేపు నాపైఁ గుట్ర సేయకుండువని నే నెట్లు నమ్ముదును? నా సుతులపై మాత్రము నీకుత్సితమును బ్రయోగింపవని నాకెట్లు విశ్వాసము?"

"నీచా! ఇదియంతయు నీ యుపదేశముననే గదా జేసితిని. పరమద్రోహియగు నిన్ను నమ్మి నాచేతులార నా యింటి కగ్గి పెట్టితిని."

"దాని ఫలమే యిప్పు డనుభవింతువు. నేను నా ప్రయోజనమునకై చెప్పుదును. నిన్నెవ్వరు వినుమనిరి?

ధర్మాసక్తిగల ప్రాణి నీవలెనే యుండునా? నిన్ను నేను నమ్మను.''

''ఛీ! పాపీ! నన్ను నీవేమి సేతువో సేసికొమ్ము'' రంగాసాని మొదవిఱచినది. ఆమె కండ్లయం దగ్నిజ్వాలలు భగభగ మండినవి. నారప్ప హుంకరించినాఁడు. ఆ హుంకారములోననే రంగాదేవి మెదలో కత్తిదూఱినది.

మఱుదినమున నారప్ప సింహాసనమున బట్టాభిషిక్తుఁడయ్యెను. ఈ వార్తలు దేవరాయునకు రహస్యముగ వెళ్లెను. దీనుఁడును, స్వాపరాధ పరిదగ్ధుఁడును నగు నాముసలి నృపతి తిరిగి వచ్చినాఁడు. ఆ లోపలనె యితనికొఱకై దుర్గమాంధ్యా కారాగార మెదురుచూచుచున్నది. వచ్చిన వెంటనె యారా జందు బంధింపఁబడెను. కల్యాణదేవి చెఱసాలయందే చిక్కి చిక్కి మరణించెను.

నారప్ప రాజ్యము రాక్షసరాజ్యము. ప్రజలు గ్రామములు వదలి వెళ్ళిరి. పతివ్రతల మానభంగము లనేకములు జరిగినవి. పాపము లన్నియు వాని తలపైఁ బిశాచములై వెక్కిరించెను.

కొన్నాళ్ళకీవార్తలు పెంగల్బుట్టున దెలిసినవి. చిన్న దేవరాయలు మహోగ్రుఁడై మండినాఁడు. ప్రాణములకు దెగించి యాతఁడు వచ్చెను. అంతకుముందే నారప్ప పాలనముతో విసిగిన యనేకసామంతు లాతనివైపు దిరిగినారు.

వారి సాయమున నారప్పను సకుటుంబముగఁ జిన్నదేవరాయఁడు హతమార్చినాఁడు.

శత్రుపక్షవిచ్ఛేది, చిన్నదేవరాయలు ఘనగిరి సింహాసనము నెక్కెను. తరువాతఁ గొన్నిరోజులకు బంగారమ్మకు గర్భమైనది. ఆ కొడుకునకు రాజ్యము సంక్రమించెనఁట! మేఖలాదేవి ప్రేమమాత్రము హృదయవిదారకముగఁ బరిణమించినది.

---

# రామరాయలు

## ఉపకార శుల్కము:

విజయనగర సామ్రాజ్య చరిత్రయందుఁ గృష్ణదేవ రాయలకాల మొక సువర్ణయుగము. అతఁ డెంతటి పరాక్రమవంతుఁడో యంతటి యదృష్టవంతుఁడు. రాయలను మించిన పరాక్రమశాలురు అతని తర్వాతఁగూడ వచ్చిరి. తిరుమల దేవీ వల్లభుని యల్లుఁడైన రామరాయల మేధాసంపత్తి నరసాత్మజుని కెందును తీసికట్టుగాదు. కాని రాయల యదృష్టము మాత్రము కోదండరామునకుఁ బట్టినది కాదు. ఆరవీటి వంశమునందు జన్మించిన రెండవ వెంకటభూపతియు రాయలవలెనే విక్రమ సవ్యసాచి. వీరందఱికంటెఁగూడ విజయనగర సామ్రాజ్య పతనకాలమున నున్న శ్రీరంగదేవ రాయలు చాల పరాక్రమవంతుఁడు. రాచరికములలో వాని మెదడు వాఁడి దఱుఁగనిది. కాని, దురదృష్ట మా మహారాజు తలపైఁ బ్రళయతాండవమాడెను. అందుచే వాని ప్రతిభ కాలఖడ్గముచే దళితమై పోయినది. నాలుగు దిక్కుల యందును నిండువెన్నెలలవలె నావరింపఁదగిన శ్రీరంగదేవ రాయల కీర్తి "నియతి" వాడికోఅలక్రింద నలఁగి చచ్చెను.

ప్రౌఢదేవరాయల సామ్రాజ్యము కర్ణాటక సాహిత్యమున కొనర్చిన సేవకంటెను రాయలు తెనుఁగునకు గావించిన యూడిగము గొప్పది. నిరంతర కదనరంగములతోఁ గంటినిండ నిద్ర వెఱుఁగని యా రాజు సాహిత్యసేవ దన

విధియనుకొన్నాఁడు. 'ప్రతివర్ష వసంతోత్సవ కుతుకము'తో వచ్చిన యొందఱో కవితల్లజులకు గండపెండేరములు, కనకాభిషేకములు, అగ్రహారములు, ఆందోళికలు ఆ మహారాజనుగ్రహించెను. స్వయముగకూడ తాను కవి. ఆ రాయలు కావించిన యాముక్తమాల్యద భావనూత్నతకు, శబ్దపుష్టికిఁ గాణాచి. తాను వైష్ణవుఁడైనను నితర మతములను సవతితల్లి మాత్సర్యముతోఁ జూడక సమానముగ మన్నించిన మనస్వి యాతఁడు. రాయలసభ కేవల మాంధ్రభాషనే పోషించినదిగాదు. ఆ రాజు సన్మానముఁ గన్నడ కవులుఁ గూడ నందికొన్నారు. తమిళ మహాకవులును గృష్ణరాయని విద్యావైశద్యము నాశ్రయించి బ్రదికిరి. రాయల సింహాచల విజయమునుగురించి యొక తమిళకవి బ్రహ్మాండముగ కవన మల్లెను.

కృష్ణరాయలు గొప్ప నైణికుఁడు. ఆతనికి వీణను నేర్పినది యొక మధ్వగురువు. నాట్యము నాతఁడు ప్రోత్సహించెను. రాయల యంతఃపురమున నాట్యవిద్యను గరపుచు భరతాచార్యు లెందరో బ్రతికినారు. ఆతని జీవితము జాల నియమ బద్ధమై యుండెడిది. స్వభావముగనే సుందరమగు రాయల శరీరము వ్యాయామముచే నింకను నాగుదేరి చూచువారి కబ్బురపాటు గల్గించుచుండెను. ఆయన చూపులు దీక్ష్ణములు. దర్శనమాత్రమున నవి శత్రువుల లోఁగొనజాలియుండెను. రాయల రాయబారులలో 'న్యూనిజ్' 'పయస్' వంటి విదేశీయులుగూడ బ్రదికి యాతని

కీర్తి వేనోళ్ళ పొగడిరి. వారు మన చరిత్రలో మెఱుఁగు పెట్టినారు.

ఇంతటి వైభవమును రాయ లనుభవించుటలో గంటి కగుపడని యదృష్ట మొకటి యున్నను స్పష్టమైన కారణము మాత్రము మంత్రిపుంగవుఁడగు తిమ్మరుసు బుద్ధిసంపదయే. చిన్నతనమునందు రాయల ప్రాణమును రక్షించిన దాబీద బ్రాహ్మణుఁడే.

ఆ విషయము కృష్ణరాయలకుఁ దెలియును. అందుచే నాతఁడానాటినుండి సాళ్వ తిమ్మరుసు 'నప్పాజీ' యను చుండెడివాఁడు. తిమ్మరు సానాఁడు రక్షింపకున్నచో మనకు రాయలుండఁడు. ఆంధ్ర సాహిత్యమున కీ వైభవమును లేదు. ఇంతమాత్రమేకాక తన జీవితాంత మాతఁడు రాయల నాశ్రయించి నీడగా బ్రదికెను. రాయలు బహామనీ పాదుషాల జయించుటలోను, గజపతుల నోడించుటయందును బ్రధానపాత్రను వహించినది సాళ్వయప్పాజీ యఘటనఘటనా సామర్థ్యమే !

ఇంత వైభవముగ జరిగిన రాయల కాలము గడపు విషాదాంతమైపోయినది. అతని కెన్నాళ్ళకును గుమారుఁడు గల్గినవాఁడు గాఁడు. ఆ కుమారప్రాప్తికై కృష్ణరాయలు తిరుపతియాత్ర లెన్నిసారులో గావించెను. స్వర్ణధేను, తులా పురుషాది దానములను జాలసారులు చేసినాఁడు. ఈ తప స్సున కంతకు ఫలితముగ రాజునకు జరమవయస్సున నొక్క సుతుఁడు గలిగెను. వానికిఁ దిరుమలదేవమహారా జని కృష్ణ

దేవరాయలు పేరుపెట్టికొనెను. తిరుమలదేవయ్య యాతేం డ్లవాడై నంతనే రాయలు వానికిఁ బట్టాభిషేకముసేయ నూహించెను. పట్టాభిషేకమహోత్సవముగూడ సాఁగినది. అప్పుడు వేడుకలు విజయనగరమునందు గొన్నిమాసముల వఱకు నిరాఘాటముగ జరగెనట! ఆ వేడుకలయందే దుర దృష్టవంతుడగు నాకుమారుడు మరణించినాడు. ఇక జెప్పవలసినదేమున్నది! రాయల యాశలన్నియు గంగపా లై పోయినవి. తిరుమలదేవయ్య మరణము చరిత్రయం దొక చిత్రఘట్టము. వాని కెవ్వరో విషప్రయోగము చేసిరని విదేశరాయబారుల వ్రాత లున్నవి.

సాళ్వతిమ్మరుసున కప్పుడే యొదటో ప్రతిపక్షులు బయలుదేరినారు. వారందరతని బుద్ధిబలము జూచి గన్ను గుట్టినవారు. ఈ ప్రతిపక్షవర్గమంతయుఁ దమలోదాము మాటాడుకొని కథను బొందికగా దీర్చి తిరుమలయ్య దేవ రాయలకు విషప్రయోగముసేయించినదిసాళ్వతిమ్మరుసేయని రాయలతో మనవిచేసినారు.

వయస్సు చెల్లినవాడును నేకపుత్రి మరణ వ్యాకులితు డును నగు రాయలకు వివేకమే లేదు. అతఁ డాయాప్త బ్రువుల మాటలువిని తిమ్మరుసును, నతని తమ్ముడగు గోవింద రాజును, దిమ్మరుసు మంత్రిపుత్రుఁడైన గోవిందరాజును జెర సాలలో బంధించెను. నిజముగ రాయ లప్పుడు గొంత వివేక ముతో నాలోచింపవలసియుండెను. కాని యాతని వయస్సు,

పుత్రవియోగము ప్రబలమైనవి - రాయలను గొప్ప యవివేకమున కీడ్చినవి.

చెరసాలయందున్న సాళ్వతిమ్మరుసు తమ్ముఁడు గోవిందరాజు తప్పించుకొని రాయదుర్గపు ప్రాంతములకుఁ బరువెత్తెను. ఆ దుర్గాధ్యక్షుడు వానికి బంధువు. వారిరువురును చేరి రాయదుర్గమధ్యమునందున్న యరణ్యముల నండఁగాఁ గొని కృష్ణరాయల యధికారముపైఁ దిరుగుబాటుఁ గావించినారు. ఈ వృత్తాంతమును విన్నంతనే రాయలాగ్రహోదగ్రుఁ డయ్యెను. అపారమగు సేన రాయదుర్గమువైపు రెప్పపాటులో గదలినది. కొన్నిదినములలోనే సాళ్వ గోవిందరాజు బంధితుడై రాయలకడకుఁ గొనిరాబడెను. ఇక నేమున్నది? సాళ్వతిమ్మరుసుపై నభియోగము స్థిరపడిపోయినది. పిల్లతినముతో గోవిందరా జొనరించిన తిరుగుబాటు ప్రబలసాక్ష్యమైపోయెను. నిండుకొలువున రాయలు తిమ్మరుసునకును, తత్పుత్రునకును, తిమ్మరుసు తమ్మునకును గ్రుడ్లు పెరికించెను. మహామంత్రి దనకంతకుముందు గావించిన యుపకారములన్నియుఁ దిమ్మరుసు నపరాధిగ నిర్ణయించుటలోనే రాయల బుద్ధి కపుడు పనికివచ్చెను. ఈ ఘట్టము మాత్రము కృష్ణరాయల జీవితమున జాలవిషాదకరమైనది. ఈవిషకణముతో నిండుపాలకుండవంటి "సాహితీసమరాంగణ సార్వభౌముని" జీవితమంతయు దుష్కీర్తికళంకితమై పోయినది. సాళ్వతిమ్మరుసు మరణానంతరము సాళ్వనాయకుఁడు కృష్ణరాయలకుఁ బ్రధానమంత్రియైనాడు. తిమ్మరుసు

చావు వెనుక రాయలు బ్రదికినదియు చాల కొద్ది దినములే. ఆ కొలదిదినములు నాతఁడు బ్రదుకుగాని బ్రదుకు బ్రతికెను. ఈ కృతఘ్నతాపాతక మాతనిని వ్యాధియై పట్టుకొన్నది. ఈ వ్యాధితోనే రాయలు లోకాంతరగతుఁడైనది.

కృష్ణరాయల కిరువురు బిడ్డలుండిరి. అందుఁ దిరుమలదేవి రాయల పెద్దభార్యయైన తిరుమలాంబబిడ్డ. రాయల చిన్న భార్యయగు చిన్నాదేవికి నొక కుమారిత యున్నది. వీరిరువురకును రాయలు స్వయంవరము చాటించియుండెను. వారిలోఁ దిరుమలాంబ, యారవీటి రామరాజును వరించినది. నాఁటినుండియు నాతని కళియరామరాజని పేరు. చిన్నాదేవి బిడ్డ వరించినది తిరుమలరాయలను. ఈ తిరుమలదేవ రాయలు అళియరాముని తమ్ముఁడే. చిన్నతనమునందు అళియ రాముఁడు గోలకొండనవాబుకడ నుద్యోగిగా నుండెను. ఒకానొక సన్నివేశమునందు రామరాయఁడు నవాబుచే ఘోరముగ నవమానింపఁబడినాఁడు. అందుచే నాతఁడు వాని కొలువు విడచి రాయల నాశ్రయించెను. రామరాయలు మహా పరాక్రమవంతుఁడు. రాయల కడకు వచ్చినప్పటి నుండియు రాముని విక్రమము ద్విగుణీకృతమైనది. కృష్ణ రాయఁడు ప్రతిపక్షులతోఁ గావించిన యొక్కొక్క యుద్ధము నందును రామరాయల విక్రమము గుర్తింపబడుచునే వచ్చినది. గజపతులతో జరిగిన యుద్ధమునం దతఁడు అసామాన్యుఁడై విహరించెను. గౌతమీనది రామరాయల కత్తి వాదరనుండి పాఱిన రక్తముచే నెఱ్ఱవాఱెననియు, ఆ నీటి

యందు రాముఁడు గత్తుల గడిగెననియు నొక మహాకవి మనోహరముగ వర్ణించెను. క్రమక్రమముగ రామరాయలు కృష్ణరాయల యష్టమంత్రులయం దొకఁడయ్యెను. కడ కల్లుఁడుగూడ నైనాఁడు. స్వవిక్రమముతో నాతఁడు "కోదండ రాము"డని బిరుదు సంపాదించుకొనెను. అతని పేరన్న ప్రతి పక్షులకు సింహస్వప్నము. కృష్ణరాయలకు సర్వసైన్యాధి పతియు నాతఁడే. రాయలకాలమునఁ గొన్నాళ్ళాతఁడు - "బడగ, తెలంగ" దేశములనుగూడ బరిపాలించెను.

అస్తమయము:

నాఁడు విజయనగర రాజభవనమంతయుఁ గళా హీనమైయున్నది. దాసదాసీల కలకలనినాదములు మంద గించెను. తాంబూల కరండవాహికల మంజుమంజీర శింజా నములు లేవు. హజారములఁ గాచుచున్న ద్వారపాలకులును గత్తులొఱలయం దిమిడ్చికొని యేమో యవనతముఖులై యున్నారు. మణియష్టికలపై నున్న మయూరములు బర్హా ములు గుంచించుకొన్నవి. కీరశారికలు సోమరితనమున సొలుగుచు నావులించుచు నుండెను. దేవేంద్రుని యంతః పురమున కెందును దీసిపోవని విద్యానగరాధీశుని శుద్ధాంత మీనా డాకులు సంపూర్ణముగ రాలిపోయిన మ్రోఁడు చెట్టు వలె సౌందర్య లేశ శూన్యమైయున్నది. గాన మందిరము లందును, భరతనాట్యాగారములందును, చిత్రశాలలయం దును దీపము బెట్టి వెదకినను నొక్క పిట్టలేదు. వీణియల చెక్కుగీటి శృతిపరచి కొన్ని నెలలైనది. అవియన్నియు

ధూళీధూసరితములై తామున్న చోటుఁగూడ నెవ్వరికిఁ దెలియక యన్యదేశములం దల్పవిద్వాంసులవలె మూఁగ నోముఁ బట్టినవి. అంతఃపురమునందు వేలకొలది దాసీలు గబగబఁ దారాడుచున్నారు. ప్రతియొక్కరి కఱనిముస మైనను తీఱిక లేదు. ఎవ్వరి మొగమునందు గత్తితోఁ గాటువేసిన రక్తము గానరాదు. ప్రతిదినము నా యంతఃపురమున వేలకొలఁది దీపపు సెమ్మెలు వెలుఁగుచుండెడివి. ఈనాఁడు కొన్నినూర్ల దీపములు మాత్రమే రేలఁ బ్రకాశించుచున్నవి. ఆ పరిమిత దీపముల కాంతులుగూడ దారిద్ర్య బాధితుని మేధవలె - సభూతమగు నపవాదమున నిరాస్తమగు కీర్తివలె, నుత్సాహదగ్ధుని హృదయమువలె నల్పములై యుండెను. ఆ యంతఃపురమున దారాడుచున్న స్త్రీలు సమస్తభూషణములను వర్జించియున్నారు. గుగ్గులు ధూపసుగంధంబులు లేవు. మధురవాసనా వాసితములగు గంధపు ధూపసక్తదండలు నా శుద్ధాంత కుడ్యములపై నిద్రవేలాడుట లేదు. ఆ స్త్రీల కొప్పులు కుసుమ విసరవివర్జితములై సద్గుణవిరహితుని హృదయములైనవి. ఈ స్థితి యీయంతఃపురమున సుమారొక నెలనుండి యున్నది. నేఁడాయాకులత మరియు నెక్కువైనది.

రాయల కీనాఁడు మరణదినము. అతఁ డెంతటి రూపవంతుఁడైనను నా దిన మా సౌందర్యమంతయు మృత్యుచ్ఛాయలచే బిహితమైయున్నది. కృష్ణరాయఁడు రత్నములు గీలించిన మంచముపై బరుండియుండెను. ఎదుట

విచారమనస్కుఁడై ప్రధానమంత్రి సాలగరాజున్నాఁడు. అతని వెనుకనే యొక యున్నతాసనమున నున్నవాఁ డళియ రామరాజు. ఆతని కవ్వల రామరాయల తమ్ముఁడు దిరుమల దేవరాయఁడుండెను. కొంతదూరమున నతని తమ్ముఁడు వెంకటాద్రి కూర్చొనియున్నాఁడు. మరొకదెస సామంత మండలియంతయుఁ జేతులుగట్టి నిలచియుండెను. ఒకవైపు నాయకులు, నాయకాచార్యులు గత్తులకైఁ జేతులు విడిచి నెత్తిపై నుంచుకొనియుండిరి. పేరుమ్రోసిన భిషగ్వరులకు దిక్కుతోచుటలేదు. కాలము దాపురించినపు డేయౌషధము ఆయువును మారిపోయఁగలదు? వారు దమప్రాణము లొడ్డియైనను రాయలప్రభువు నిలుపవలెనను రాజభక్తిగలవారే! కాని యేమిసేతురు? ఒకరినొకరు బలుకరించుకొనుటయే లేదు. చర్చలు, సలహాలు వీని కన్నిటికిఁ గాలము ముగిసినది. ఈ నిశ్చలనీరసమైన సన్నివేశమున మృత్యుదేవి రాయలతో దాగుడుమూత లాడుచుండెను.

ఉన్నటులుండి రాయలు హఠాత్తుగా "సళియా" యని సంబోధించినారు. ఆ పిలుపు కర్ణాటకచక్రవర్తి దమ సమస్తశక్తిని వెచ్చించి యెచటనో నాభిసమీపమున నణఁగి యున్న వైఖరీవాక్కును బలవంతముగఁ జేసికొనివచ్చినటు లుండెను. ఆ పిలుపుతో నవనతశిరస్కుఁడై యున్న రామ రాయలు మామ దగ్గరకువచ్చి నమస్కరించి నిలచెను. నిలచినవెంటనే రామరాయలకుఁ గన్నులనిండ నీరాచికొన్నవి. రాయలు గృష్ణుఁడైనచో నళియఁ డుద్ధవునివంటివాఁడు.

ఆతఁడు గృష్ణరాయల కల్లువాఁడైనను నా యభిమానము రవంతయు లేదు. కృష్ణరాయల నళియఁడు దేశికునిగా దరిసించెను. అనేక రాజకీయ రహస్యములు శిష్యుఁడై, యంతేవాసియై నేర్చికొన్నాఁడు. ఈనాఁడు గృష్ణునిపై నాడుచున్న మృత్యుచ్ఛాయలు రామరాయల పాలిటికిఁ దనపైననే యాడుచున్నటులున్నవి.

రామరాయల కన్నెరు గృష్ణున కెదలో నాకు పోటు. ఆతని యాశలన్నియుఁ గేంద్రీకరింపబడినది రామరాయల పైననే. కృష్ణరాయల హృదయమును గలఁతబెట్టుచున్న విషయములు నేఁడు రెండే. తిమ్మరుసుని మరణము దలఁచికొన్నపుడంతయు రాయల హృదయము విన్నపుగ్ధమగును. మహామంత్రుల చావు రాయల కెన్నిదుఃఖములనో రేకెత్తించును. ఒకవైపు దన పుత్రహీనతయు నేకైకపుత్రమరణమును మహామంత్రి రాజ్యాశతోఁ దనకు గావించిన యపకారమును దలఁచుకొనవచ్చును. ఒక దిక్కునుండి తిమ్మరుసు స్వామిభక్తి, దేశభక్తి, తనకాతని యెడనుండిన పితృభావమును, దన్నాతఁడు వీరనరసింహుని హింసాదంష్ట్రలనుండి రక్షించిన యుదారత, దన జీవితము నహోరాత్రములు వేయి కనులతోఁ గనిపెట్టియుండిన ఋణానుబంధము బరువులెత్తి వచ్చును. సత్యాసత్యములనడుమ నర్థమైకాని మానవ జీవితమువలెనే రాయలకు మహామంత్రుల మరణ మొకసమస్య.

కృష్ణరాయలను బాధించు మరియొక విషయము దన యనంతరము రాజ్యక్షేమమేమి యగునని. తన గర్భమున

జనించిన తిరుమలయ్య స్మశానమున నిదురించెను. ఇపుడు దనకున్న కోరికయంతయు నొక్కటే. తుళువ వంశాంకుర మొక్కటి యున్నది. అది దన సవతి తమ్ముఁడైన యచ్యుత రాయలు. తాను రాజ్యమునకు వచ్చిన వెంటనే రాజ్యక్షేమ మునకై వానిని జంద్రగిరిలో బంధించి యుంచెను. తన యనంతరము వాఁడు రాజ్యమునకు రావలెనని గృష్ణరాయల తీవ్రాకాంక్ష. వానికి స్వయముగనే బట్టాభిషేకముఁ జేయఁ దలఁచికొన్నాఁడు. కాని చంద్రగిరినుండి యచ్యుతుఁడు వచ్చు వరకుఁ దాను బ్రతికియుండుననను నమ్మక మా మహారాజునకు లేదు. అందుచేఁ దన యనంతరముఁ దనయాజ్ఞపై విశ్వాస ముంచి యచ్యుతుని రత్నఖచితసింహాసన మెక్కించు రాజ భక్తి పరుఁడు గావలెను. సాలగరాజుపై రాయల కట్టి విశ్వాసము లేదు. కనుక రామరాయల కీకార్యమునొప్పింప వలెనని కృష్ణరాయలు నిశ్చయించికొన్నాఁడు.

తన యెదుట నిలిచికొన్న రామరాయలను జక్రవర్తి నిండుకన్నులతోఁ జూచినాఁడు. రామరాయల స్వరూపమం దాతనికి భావిహైందవ ధర్మదీక్ష యాకార మెత్తినట్లు గాన్పించెను. కొంత తడవట్లే చూచి చూచి మహారాజు లేమి యూహించిరో "యళియా! అప్పాజీమంత్రులు దప్పిద మును జేసియుందురందువా?" యనిరి. ఈ మాటలు రాయల కన్నీటితోఁ దడియుచునేగడ్డకు వచ్చినవి. దీనికి రామరాయ లేమని యుత్తరమిచ్చును? అళియ రామునకు మాత్రమిందు సత్యమును దేల్చు శక్తి యెక్కడ నున్నది? తిమ్మరుసులవధ

లోని న్యాయాన్యాయములను దైవము దేల్చవలెను. దైవ మున కన్నను మిన్నలగు బ్రహ్మవాదులు జెప్పవలెను. రామరాయలు వెఱ్ఱిగ మామవైపుఁ జూచినాఁడు. ఆచూపున "కా" నని యర్థముగాదు. కాదనియు గాదు.

సాలగరా జందికొన్నాఁడు. "మహారాజా! మీ రమాయకులై యా బ్రాహ్మణుని నమ్మితిరి. వాని యాశా దంష్ట్రావిటంకములలోఁ దిరుమలయ్య బ్రదుకు మాసిపోయి నది. తిమ్మరుసు మంత్రియే విషప్రయోగ మొనరించె నను సందేహ మెందులకు? తమరు ముంజేతి కంకణమున కద్ద మును వెదకుచున్నారు."

మహారాజులు సాలగరాజు వైపునకు జూచిరి. ఆ విషయమున సాలగుఁడు మాటాడుట కృష్ణరాయల కంత యిష్టమై యుండలేదు. కాని యా సమయమున నెవ్వరిని ధైర్యముగ నిరోధించు స్థితియందు మహారాజులు లేకుండిరి. తమకుఁ గలిగిన యావేశమంతయు మనసులోననే వారణఁచి కొన్నారు. మరల రామరాయల దిక్కు మొగమైరి. "అల్లియా! ఈ ఘోరపాతకమున కేమి ప్రాయశ్చిత్తమో తెలియుటలేదు. తిమ్మరుసులు నిరపరాధులైనచో వారి శాపాగ్ని మన రాజన్య వంశమునే గాల్చివేయునని నా యూహ. విద్యారణ్యుల తపస్సుచే బ్రవర్ధితమైన యీ మహాసామ్రాజ్యము నా యీ తెలివిమాలిన పనిచే నశిం చునా?" కృష్ణరాయ లీ మాటలు పలికి ముగించిరో లేదో

దూరమున నెక్కడనుండియో తీతువు గూసినది. ఆ కూసిన యారావము రాయలమాటల 'కవునవు' నన్నటులుండెను. ఆ పక్షికూత యట గూరుచున్న సభకంతయు స్పష్టముగ వినబడెను. ఆలోచనా వ్యగ్రులగు సరదారులకెల్ల నది యే పక్షి యరపో నికరముగఁ దెలిసినదియుఁ గాదు. రాయలకు మాత్ర మా యఱపు మృత్యుదేవి యాహ్వానమని తెలియును. ఆ సమయమున నా విహగ కూజితము దిమ్మరుసు వధ 'యన్యాయ' మని ధ్వనించినట్లు మహారాజులకుఁ దోచినది. వా రకస్మాత్తుగ నేడువ మొదలుపెట్టిరి. రామరాయలకా యేడుపున కర్థము దెలియును. తెలిసి యేమి చేయ గలఁడు? ఓరంత ప్రొద్దట్లే గడచినది. చక్రవర్తులు రామరాయలను దగ్గరకు లాగికొనినారు. చాల దగ్గరకు లాగికొనినారు. వారి యెదలు సంపూర్తిగఁ గలసికొని పోయినవి. కృష్ణరాయల గుండెలలోనుండి యేదోయొక యమూల్యమగు తేజఃప్రసారము తన యెదలోనికిఁ బరుగిడుచున్నట్లు రామరాయలకు దట్టెను. మెల్లగా కృష్ణరాయలనిరి : “అళియా! నా యనంతర మచ్యుతుని సింహాసనమం దుంపవలెనని నా యాశ. మహానదీ ప్రవాహమువలెఁ దుళువ వంశము హైందవ ధర్మక్షేత్రములపై బారుచున్నపుడు మీ వంశములు గర్షకులై సాగుఁ జేయుచున్నచోఁ బై లోకములం దున్న మా యాత్మలు సంతోషించును. దీనికి నీవేమందువు?”

రామరాయల కన్నులలో నీరు దిరిగిపోయినది. అళియని యప్పటి మానస మనేక భావముల కాకరమై

పోయెను. ఇందలు ఈ సభయందుండగా మహారాజులు దనతోమాత్ర మీ ప్రస్తావన యేల సేయుచున్నారు? ఇందటిలోఁ దినయాజ్ఞ బరిపాలింపఁగల న్యాయదృష్టి, ధైర్య సాహసములు దన కొక్కనికే కలవని వారి విశ్వాసమా? లేక దన యనంతరము రాజ్యమును లాఁగికొనుటకై నేను యత్నింపవచ్చునని దలఁచి యట్లు సేయకుండుటకై భంగ్యాం తరమున నిరోధించుచున్నారా? ఈ భావము మానసమున మెదలిన వెంటనే రామరాయల యాపాదమస్తక మొక్క సారి గంపించి పోయెను. వారి హృదయము గఠిన శిలవలెఁ గఠినమై గులిశమువలె వాఁడియై పర్వత శిఖరమువలె దుర్ధర్షమై పోయినది. రామరాయలు వెంటనే యన్నారు. "అయిన మామా! నన్నేమి సేయుమందురు?"

ఈ మాటతో దీని యాంతరిక వేదనయుఁ జక్రవర్తి కర్థమైనది. ఎదుటిమనస్సుల నక్షరక్షరము విడువకఁ జదువఁ గల యపార మేధ యాతనిది. వారు వెంటనే యందు కొనినారు: "రామరాయా! నా ప్రశ్నమును నీవు దప్పుఁ దలచినటులున్నది. మన వంశాద్యులైన చంద్రబుధులతోడు నీ ప్రవర్తనమును నే నాశంకించుటలేదు. ఇప్పటిలో నాసర్వ విశ్వాసములును నీయందుఁ గేంద్రీకృతములై యున్నవి. నా యనంతరము ఆడినమాటఁ దప్పక ధైర్యముగాఁ బనిని నెరవేర్చువాఁడవు నీవే. నాకు మాటయిమ్ము. ఈ విషయమై నిర్విచారముగఁ బ్రాణముల విడతును."

కటకమునుండి గన్యాకుమారివరకుఁ బరభీకరుఁడై తన కత్తి కెదురులేక బరిపాలించిన మహారాజు నేఁడు దన్నొక మాటకై యాచించుచున్నాఁడు. ఈ తలఁపు మొదలెనో లేదో రామరాయల హృదయ మెన్నిరీతులనో యైనది. అతని యెద యంతయు మెలికలు జుట్టెను. అగ్ని దగ్ధమైనట్లు బగబగ మండెను. మంచునఁ దడిసిన బూవువలెఁ గళాహీనమయ్యెను. కృష్ణరాయల వేడికోలు కటకము మొదలు గన్యాకమారివరకుఁ గల భూమియొక్క వేడికోలై యతనియని స్మృతికిఁ దట్టినది. అహా! వింధ్యపర్వతము జేతు గట్టి యెదుట వంగి యాచించినది. ఉత్తుంగ సాలవృక్షము శిఖరాగ్రము కన్నను జిన్నదై నేల దాకినది. కాలమహిమ యిట్టిది!

"మహారాజా! మీరు నన్నిట్లడుగుట నాకు దుఃఖ కారణమే గాని గర్వహేతువు గాదు. మీ యాజ్ఞను బరి పాలించుట మాకుఁ గౌలీనత. తప్పక మీ యానతి నెర వేర్తును. రామరాయల మేనియందుఁ బ్రాణముండగాఁ దుళువ వంశమునకుఁ దప్ప మఱొక్కరికి విద్యానగర సింహా సనమువైపుఁ దేఱిచూచుట కధికారమే లేదు. సూర్యుడే పుడమికి దిగివచ్చి యట్టి ప్రయత్న మొనరించినను నేనడ్డగించి తీఱెదను." రాయల కళలారిన కన్నులనుండి రెండుమూడు నీటిబొట్లు నల్లనై యున్న కపోలములపై నిలచినవి. అవి విషాదబాష్పములో! ఆమోదబాష్పములో!!

కృష్ణరాయ లావిషయమై మ తేమియుఁ| దర్శింప లేదు. ఈవార్త నచట జేరినవారికిఁ బ్రకటించుమని మాత్రమే చెప్పిరి.

రామరాయలు సరదారులవైపుఁదిరిగెను. అంతవరకు నొఱలో నొదిగియున్న యాతని కత్తి హఠాత్తుగఁ జేతికెగిరి నాల్కలు జాఁచినది. "మూరురాయరగండలును సకు రోద్దండులును జతుస్సముద్రాధీశ్వరులును నగు కృష్ణ రాయలవారు దమ యనంతరము విజయనగర సింహాసన మున కచ్యుత దేవరాయలను నియోగించుచున్నారు. ఈ యాజ్ఞ నెరవేర్చుట కధికారము వారు నాపై నుంచినారు. అందువలన మీసమక్షమున వారియాజ్ఞ నెరవేర్తునని నేను గత్తి ముట్టి ప్రమాణము సేయుచున్నాను."

అక్కడఁ జేరిన జనులలో నీ గొడవ యెవ్వరికిని గాఁబట్టినట్లు లేదు. సరదారులు రామరాయల మాటలను హర్షింపను లేదు. విషాద మందను లేదు. వారి సర్వాశలును గృష్ణరాయలయందు వినిహితములై యుండెను. అశ్వినీ దేవతలైనను హఠాత్తుగాఁ బరతెంచి సార్వభౌముని బ్రతికించి పోఁగూడదాయని వారి కోరిక. కాని రామరాయలన్న యీ మాటలు సాలఁగరాజులోమాత్ర మొక మార్పును గలిగించెను. అతని ముఖముపై నెవరో "ఫెళ్" మని కొట్టి నటులైనది. ఒక నిముస మాతని వదనము నల్లబాఱెను. ఆ నిమేష మాత్రఁడు దన ముఖమును సభ్యులవైపు త్రిప్పిన వాఁడు గాఁడు. తన వదనమును సాలఁగరాజు తానే జూచి

కొనిసట్లుండినది. సభ్యులలో నొక రిద్దరు మాత్రము ఇప్పటిస్థితిలో సింహాసనమున కళియరాముఁడే యర్హుఁడను కొనినారు. ఆ మాటలు వారు గట్టిగ ననలేదు. తమ హృదయములలోఁ దలఁపు మెదలినంత మెల్లఁగ నాడిరి.

మరల కవంతసేపునకుఁ గృష్ణరాయలు గనులుమూసి కొన్నారు. ఆ క్రియను "వారికి విశ్రాంతి గావలసినదిగా" మాండలేశ్వరులు భావించుకొనిరి. నిశ్శబ్దముగ నొకరొకరే యచటనుండి లేచినారు. వారు బోవునప్పుడేమాత్రమును సద్దు జరుగకయుండ నంగుళీసంజ్ఞచే వేత్రహస్తులు సైగ సేయుచుండిరి. అందఱు వెడలిపోవువరకచట నిలచియుండిన వారిద్దరే - సాలఁగరాజు, రామరాయలు. చక్రవర్తులు మరల గన్నులు దెఱువకుండుటచే వారు నటనుండి గదలిరి. ఈ వీరద్వయము బరస్పరమేమియు మాటాడికొనలేదు.

మఱుదినము ప్రాతఃకాలము. తిరుమలదేవియుఁ జిన్నాదేవియు రాయల పాదములకడ దుఃఖభారనత ముఖములతోఁ గూర్చుండియున్నారు. వారి కన్నులు గన్నీరు గార్చి కార్చి వాచియుండెను. కృష్ణరాయల యంఘ్రులా కన్నీటితో నిరంతరము దడిసియే యుండినవి.

ఉన్నటులుండి చక్రవర్తులు "తిరుమలదేవీ!" యనినారు. ఆమె రాయల పాదములపైనుంచియున్న మొగమెత్తి చూచెను. "నాయనంతర మచ్యుతుని సామ్రాజ్యమునకు నినియోగించి యున్నాను. రామరాయలను బారుపత్తేదారునిగఁగూడ నియోగించితిని. నా రెండవ యల్లుడైన

దిరుమలరాయఁడుగూడ యన్నరు వసుఁడు గనుకఁ జిన్నా దేవికిని నేక్లేశముండదు. నా యీ యేర్పాటు మీ యిర్వుర కును సమ్మతమే యనుకొందును.''

రాణు లేమియు మాటాడలేదు. హఠాత్తుగ రాయ ''లదుగో! దిమ్మరు''సన్నారు. మరునిముసమున నే ''పర మాత్మా! కృష్ణా! పోకు! పోకు''మనిరి. ఈ పరస్పర విరుద్ధము లైన సంభాషణము లాలకించి రాణులు దటుకున లేచిరి. దాసీలు జుట్టును ముూఁగికొనినారు. రాయల కనులు బైకీడ్చి కొని పోవుచుండెను. ఈ సన్నివేశమును గమనించిన వేత్ర వాహికలు జక్రవర్తులను నేలపైఁ బండఁబెట్టిరి. వెంటనే యొక్కసారి బదునాఱు కళలతో రాయలు నవ్వినారు. ఆ నవ్వులలోనే వారి ప్రాణ విహంగ మెగిరిపోయెను. ఇక రాయలు లేరు.

అంతఃపురమంతయు నొక్కటే హాహాకారము. ఆ యూరావములకు విద్యానగరము నగరమే బేటులెత్తిపోవు చుండెను. ప్రాతఃకాలమున రాజకార్యముల జక్రవర్తులకు నివేదింపవచ్చుచున్న యళియరామునకు మధ్యేమార్గమున నే యీ వార్త జెవులఁబడి యట్లే గూలఁబడినాఁడు.

అచ్యుతరాయలు:

కృష్ణరాయల మరణానంతర మచ్యుతునకు వార్త వెళ్ళినది. ఆ వార్త నాతనికిఁ బంపినవాఁ డళియరామ రాయలే. కర్ణాటక రాజ్యలక్ష్మి దన్నాహ్వానించుచున్న

దనుట నచ్యుతుఁడు నమ్మలేకపోయినాఁడు. తన యాయు వర్ధ మునకుఁబైగాఁ జెఱసాలయందే గడచినది. ఒకవేళ గృష్ణ రాయఁడు దన యంత్యకాలమున జెప్పెనే యనుకొందము. అతని మరణానంతర మళియఁడే బట్టాభిషిక్తుఁడైన వాని నెవ్వ రాక్షేపింతురు? తన బలఁగ మెంతయున్నది? ఒకవేళ నొక రిద్దరు సరదారు లొల్లనివా రున్నను వారి యాయు వులు గోదండరాముని యాశ్రితుల కరవారముల కెఱయై యుండెడివి. అళియరాముఁడు సిరిరా మోకాలొడ్డెను. ఆ యొడ్డుట సిరికన్నను ధర్మమును బలవత్తరముగఁ బ్రేమించుట వలననే. ధర్మానుబంధియగుఁ గోదండరాముని వర్తన మచ్యుతున కాశ్చర్యము జేకెత్తించినది.

అచ్యుతరాయలుగూడ దుళువనరసరాయలసుతుఁడే. తుళువనరసరాయలకు మువ్వురు భార్య లుండిరి. మొదటి భార్య దిప్పాంబ. ఆమె సుతుఁడే వీర నరసింహరాయలు. తండ్రి యనంతర మీతఁడు గద్దెనెక్కి "దారుణకరవాల పరుషధారాహత వీరారి"యై ధర నేకాతపవారణముగ నేలెనట!

చారిత్రిక ప్రసిద్ధుడైన గృష్ణరాయలఁ గన్నతల్లి నాగలాంబ. ఈమె నరసరాయల రెండవ పత్ని. ఆనాఁడు యదువంశమున జన్మించిన గృష్ణుఁడే మఱల యాదవ కుల శాఖయగు దుళువాన్వయమున జనియించెనని యాకాలపు జనులందరు నమ్మిరి. కృష్ణరాయల సమకాలికులును నర్వా చీనులును నైన గవు లీ విషయమును దమ గ్రంథములలో

భాషాటీకముగ వ్రాసికొనినారు. రాయలు దన రాజ్యపాలనా ధౌరంధర్యముచేతను లీలామయమై యసామాన్యమగు జీవితముచేతను ఈవిషయమును జక్కఁగ స్థిరీకరించికొనెను.

తుళువనరసరాయల మూడవ భార్య ఓబాంబిక. ఆమె కిర్వురు సుతులు. వారిలోఁ బెద్దవాఁడే యచ్యుతరాయఁడు. ఇతని కొక దమ్ముఁ డుండెను. అతని పేరు రంగరాయలు.

అచ్యుతరాయల భార్య వరదాంబిక. ఆమె సకల రాజప్రియపుత్రిక. కారాగారమునందే యచ్యుతరాయల కొక కుమారుఁడు గలిగియుండెను. వాని నామధేయము చిన్న వెంకటాద్రి. ఆనాటి రాజకుటుంబములకుఁ గారలనఁగా నేటివంటి జీకఁటి కొట్టులుగావు. వారి కందు సమస్తములగు ననుకూలము లుండెడివి. కాని యా భవనములను మాత్రము దాటిరానివ్వక కొందఱు గావలి గాయుచుందు రంతే. అచ్యుతరాయల విషయమున నా నియమము గూడనున్నట్లు లేదు. అతఁడు బందీగా నున్న నాళ్ళలోనే యెన్నిసాఱులో దిరుపతికి వచ్చి వెంకటేశ్వరుని దరిసించినట్లు శాసనము లున్నవి.

కారనుండి వినిర్ముక్తుఁడైన వెంటనే యచ్యుతుఁడు పై తిరుపతిలోఁ బట్టాభిషిక్తుఁ డైనాఁడు. వరదాంబికకు బట్టమహిషిగను జిన్న వెంకటాద్రికి యువరాజుగను నభిషేకములు జరిగినవి. అప్పటినుండి యచ్యుతుఁ డచ్యుతదేవరాయలయ్యెను. తిరుపతియందు బట్టాభిషేకము ముగించుకొని

గాళహస్తి వెళ్ళి యచట మరల నాతఁడు బట్టాభిషేకించి కొనినాడు. దానికి దన్ను గర్ణాటక జను లంగీకరింతురో లేదో యని యనుమానము. ఆ ప్రజ కళియరామునిపై గల యాదరాభిమానము లట్టివి.

అచ్యుతదేవరాయలు విజయనగరమునకు వచ్చు చున్నాడని విని యపారసేనతో రామరాయ లెదురు వెళ్లెను. ఆరవీటివంశ తిలకమగు రామరాయ లచ్యుతుని మనసార నాశీర్వదించినాఁడు. విద్యానగరమందుఁ దుళువాన్వయమున మరల బట్టాభిషేకము జరిగెను. ఆనాటి విజయనగర వైభవమును డిండిమకవి "యచ్యుతరాయాభ్యుదయమున" లోకమనోహరముగ వర్ణించినాఁడు. ఆ యేర్పాటులన్నియుఁ గావించినది యళియరాముఁడే. తన కనాయాసముగఁ దక్కు చున్న సామ్రాజ్యమును విడచి పలికిన ప్రతిజ్ఞకై బారాడు చున్న యళియని వర్తనము అంతకుముందే ప్రసిద్ధమైన యారవీటివంశమునకు బంగారమునకు దావియబ్బు టేయైనది.

రత్నఖచిత సింహాసనాధిష్ఠితుఁడైన యచ్యుతున కారవీటి రామరాజు స్వహస్తములతో శ్వేతచ్ఛత్రమును బట్టి నిలచెను. ఒకవైపు దిరుమలరాయఁడును, వేఱొకవైపు వెంకటాద్రియు నిలిచి కర్ణాటక సార్వభౌమునకుఁ గలుగుఁ జామరలు విసరిరట! అచ్యుతదేవరాయల యానాటి వైభవము దొల్లి యింద్రప్రస్థమున బట్టాభిషిక్తుఁడైన ధర్మరాజు వైభవమున్నటులే యున్నది. తనకు బిత్రీయమగు సామ్రాజ్యము సంక్రమితమైనంతనే గర్ణాట సార్వభౌముఁడు గంచి

లోని యేకామ్రనాథునకును, వరదరాజస్వామికిని అగ్రహార ములు ధారవోసెను. విద్యానగరమందే తులాపురుష దాన మునుగూడఁ గావించెనట!

అచ్యుతుఁడు సింహాసనము నెక్కినంతనే కృష్ణరాయని యాదేశము ననుసరించి కోదండరాముఁడు మహామంత్రి యైనాఁడు. అచ్యుత దేవరాయలకు సామ్రాజ్యభార మబ్బు టయే సాలఁగరాజున కసమ్మతముగ నుండెను. దానిపై యళియఁడు మహామంత్రియగుటతో వానికిఁ జేదుగాఁ జికినట్టు లైనది. రాయల యనంతరము సింహాసనమును లాగికొన జూచిన వాని యాసలన్నియుఁ దుంగలోఁ ద్రొక్కఁబడెను. విద్యానగరమునుండి వాఁడు నిమ్మళముగఁ దన "చోళ" దేశమునకు వెడలిపోయెను. తరతరములనుండి వారు విద్యా నగరముక్రిందఁ జోళ సామంతులు.

రామరాయలు మహామాత్యుఁడైనంతనే ముఖ్యముగ నాతఁడు సాధింపఁదలఁచిన ప్రయోజనములు మూఁడు: దక్కనునుండి యెత్తుకొని వచ్చుచున్న మహమ్మదీయులను దుంగభద్ర కావలిగట్టుననే యాపివేయవలెనని యాతని దృఢసంకల్పము. ఈ మహాప్రయోజనమునకే విద్యారణ్య మహర్షి యఖండదీక్షాబద్ధుడై తుంగభద్రాతటమున దప మొనర్చినది. అతఁ డనల్ప సామ్రాజ్యమున కంకురార్పణ మొనరించినదియు నీయుద్దేశముతోడనే. "హొయ్సలకుల" బల్లాణ చక్రవర్తి యీ ధర్మోద్ధారమునకే గత్తిఁబూని నడచెను. తన ప్రాణముల నీ యుద్దేశమున కా చక్రవర్తి

బలివెట్టినాఁడు. ఈ యుదాత్తపురుషుల యుత్తమసంకల్పమునే రామరాయలు దనజీవితమందును బ్రాణమొడ్డి కొనసాగింపఁ దలఁచెను.

కృష్ణరాయలు దన యఖండపరాక్రమముతో దక్షిణ దేశమంతయును గెలిచెను. పాండ్య చోళ చేర కేరళాది దేశములు విజయనగర సామ్రాజ్యమున కంకితములై పోయినవి. కృష్ణరాయలు దన యల్పజీవితమున సాధించిన యీ సిద్ధి సామాన్యమైనది గాదు. కాని యీ సామంతులు దమలోఁ దాము బరస్పరముగఁ గీచులాడు కొనుచుండిరి. విద్యానగర సామ్రాజ్య మతివిశాలమైనది. దాని వైశాల్య మునకు దగినట్లు కేంద్రముతో సంబంధముగల బటిష్ఠమగు రాజ్యవ్యవస్థయు నెలకొల్పవలసియుండెను. సామంతులకుఁ బరస్పరము గల విరుద్ధ భావములఁ దొలగించి కేంద్రప్రభుత్వ మూలమున "దామందఱు నొకయింటివా"రను భావము గలిగింప నెంతేని యావశ్యకత యుండినది. కృష్ణరాయలు మరికొంతకాలమున్నచో నీ పరిస్థితులన్నియు జక్కబెట్టి యుండెడివాఁడే. కాని యంతలో నాతని మృత్యువు గబళించి వేసెను. ఈ కార్యమును రామరాయలు దాను జక్కఁబెట్ట నెంచినాఁడు. ఇది కోదండరాముఁడు సాధింప నెంచిన రెండవ ప్రయోజనము.

అల్లాయుద్దీను కాలమున దక్షిణమునకుఁ దరలిన మహమ్మదీయులు గ్రమక్రమముగ నొత్తికొని వచ్చుచుండిరి. వా రాక్రమించికొన్న భూములలో జరిగెడి ఘోరములు

జనుల మాన-ప్రాణ-ధనముల పోకయే గాదు. హైందవ ధర్మస్వరూపమే విలుప్తమై పోవుచుండినది. జననష్టముతోఁ బోల్చి చూచినప్పుడు ధర్మనష్టము దానికంటె గడుగొప్పది. ఈ యపాయము నాలోచించియే విద్యారణ్యులకాలమునుండి హైందవరాజ్యముల నన్నిటి నొక త్రాటిపై నడపుటకుఁ బ్రయత్నము లెన్నియో జరిగినవి.

రామరాయలకాలమున హైందవమునకు గలిగిన యాఘాత మొక మహమ్మదీయులనుండియే గాదు. సముద్ర ప్రాంతములను వర్తకమనెడు నెపముతో నాక్రమించిన పరాసులు మొదలైనవారు వ్యాపారముతోఁబాటు దమ మతమునుగూడ వ్యాపింపజేయుచుండిరి. ఉభయధా కలిగిన యాఘాతములతో హైందవ ధర్మవిప్లవ మేర్పడెడుప్రమాద ముండెను. ఈ యిఱుదెగల యడ్డంకుల నడ్డగింపవలెనని యళియరాముని దృఢదీక్ష. వీని నడ్డగించుటయేగాక హైందవ ధర్మోపస్కారములగు బను లనేకము లొనర్చి పోనుఁగు వడ్డ దానిప్పును జాజ్వల్యమానము సేయవలెనని గూడ గోదండ రాముఁ డెంచెను. ఈ యూహ లన్నిటిని మనసులో నుంచి కొని యీతఁడు మామయగు రాయలకుఁ దానిచ్చినమాట మఱువక యచ్యుత దేవరాయల ముందిడుకొని యఖండమగు జాగరూకతతోఁ గౌశల్యముతో రాజ్యతంత్రమును ద్రిప్పు చుండినాఁడు. ఈ సమయమున సాలఁగరాజు విద్యానగర మును పీడుటలోని యాంతర్యమును రామరాయలు గమ నింపకపోలేదు. కాని యాతఁడు శంకించుచున్న దింతకంటెఁ

పెద్ద ప్రమాదమును. ఒకవైపునుండి బహామనీ సులతాను లెప్పుడును విద్యానగరమువైపు గన్ను వేసియే యుండిరి. ప్రతాపరుద్రగజపతి కృష్ణరాయలకుఁ దన బిడ్డ నిచ్చుట రాయల పరాక్రమమునకోడి. అంతేగాని యాతని పొత్తున కోడఁబడిగాదు. రాయలు మరణించినంతనే విద్యానగరముపై కెత్తి రావలెనన్న వాలకము గణపతిలోఁ దోఁచుచుండినది. అందుచేత నిమ్మళిముగ రామరాయలు విద్యానగరమున గూరుచుండి బహామనీసుల్తానులను, గజపతిని గసునించుచుండినాఁడు. ఈ గొడవలో నాతఁడు సాలగరాజును గొంత యుపేక్షించెను. పైగా "దన్నుమించి సాలగరా జెచ్చటికి బోవు"నను నొక "ధీమా" యును రామరాయలకు గద్దు.

ఔదార్యము :

సాలఁగరాజు తురువక్కు దైన్దామ్భట్టరు కుమారుఁడు. అగస్త్యగోత్రుఁడు. బోధాయనసూత్రుఁడు. రాయలకాలముననే యాతఁడొక పేరుమోసిన మాండలికుఁడు. సాళ్వయప్పాజిరాయలకుఁ బ్రధానిగనున్న ప్పుడితఁ డష్టమంత్రులలో నొకఁడుగ నుండెను. తిమ్మరుసు దరువాత సాలఁగరాజే బ్రధానియైనాడు. కృష్ణరాయల కీతఁడన్నఁ గడుగౌరవము. నాగమాంబసుతుఁడు. సాలఁగరా జాక్షేమమునకై యనేక దానములు స్వయముగ నొనర్చెనట!

కృష్ణరాయని మరణానంతర మాతని కుచ్చాటన జరిగినది. ఈ పగతో నతఁడు దన స్వదేశమగు "జోళ" దేశమునకు బోయెననియు నింతకుముందే దెలిసికొంటిమిగదా!

చోళదేశము జేరినంతనే సాలఁగరాజునకు బామునకు బుట్టదొరకినటులయ్యెను. తనకును, విజయనగరసామ్రాజ్యమునకుఁ గల యంతరమునే వాఁడు విస్మరించినాఁడు. స్వదేశముఁ జేరినదే దడవు స్వతంత్రుఁడనని ప్రకటించెను. అచ్యుతరాయలకుఁ గప్పమంపుట మానివేసెను.

ఈ వార్త రామరాయలకుఁ దెలిసినది. అతఁ డింతకు మునుపే యీ పరిస్థితి నాశంకించియుండెనుగదా! చోళరాజు "తిరుగుబాటు" నణఁచుటకై యళియరాముఁడు విశ్వనాథనాయకుని బంపెను. విశ్వనాథుఁడు రామరాయలకు బహిఃప్రాణమువంటివాఁడు. అత్యంత విశ్వసనీయుఁడేగాక యాహవసవ్యసాచి. విశ్వనాథనాయకుఁడు జోళమండలము దరిసెనో లేదో సాలఁగరాజు బరువు దీసెను. విశ్వనాథుఁడు జోళమండలమును సరిదిద్ది మరల విద్యానగరమునకు వచ్చివేసెను.

విశ్వనాథుఁడు విద్యానగరము జేరినంతనే సాలఁగరాజు మరల జోళదేశము నాక్రమించినాఁడు. ఈ విప్లవయత్నమున నీసారి "జేర" నరనాథుఁడును జేరెను. వాని పేరు భూతవీరశ్రీ యుదయమార్తాండవర్మ. కృష్ణరాయల మరణానంతరము వీఁడుగూడ విజయనగర కప్పమునకు సున్నజుట్టినాఁడు. వీరికి రామనాథపురమును బాలించు దుంబచ్చినాయకుఁడును దోఁడు నడచినాఁడు. ఈ దుష్టత్రయము జేరి కప్పము లెగురవేయుటయేగాక బాండ్యరాజ్యముపైఁ బడినది. "చేరపాండ్యము"లకుఁ గొంతకాలమునుండియు గలఁతలుండెడివి. ఆ ద్వేషమును బురస్కరించుకొని యుదయ

మార్తాండవర్మ బాండ్యుని రాజ్యమునుండి వెడల నడచెను. పాండ్యరాజు గోడుమని యేడ్చుచు వచ్చి తనకు జరిగిన యుద్వాసనమును జక్రవర్తికి మనవి సేసినాఁడు.

రామరాయ లిక యుపేక్షింపరా దనుకొనెను. దక్షిణదేశ కల్లోలము లీస్థితికి వచ్చునని యాతఁడు భావింపనే లేదు. ఇంకను నిట్లే యుపేక్షించినచో నుండి నుండి యిది యెంత మంటయగునో! ఈ కల్లోలమును బాణరాజులు గూడఁ బ్రోత్సహించుచున్నటుల అళియని కర్థమైనది.

కాని ''చోళ చేర''ములపైకి నెవరి నంపవలెను? విద్యానగరమునందుఁ దాను లేకున్న యదను దెలిసి గజపతులు, బహామనీసుల్తాను లేకమై దూకుదురు. కాన దాను విజయనగరము వదలరాదు. అందుచే రామరాయలు జోళచేరముల నడఁచుటకై యచ్యుతరాయలనే నియోగించి నాఁడు. ఆ కాలమున సకలము పెదతిరుమలయ్య గొండవీడున మండలేశ్వరుఁడుగ నుండెను. ఆతఁడు సమర్థుడగు సేనానియే. రామరాయ లీకార్యమున కాతనిని బిలిపించెను. అతనికి విశ్వనాథనాయకుని దోడొసఁగి సార్వభౌములను సర్వసేనాధి పతిగ నొసరించి రామరాయలు బ్రయాణము నడిపించినాడు.

అచ్యుతదేవరాయలు రణప్రస్థానయాత్రలోఁదొలుతఁ జంద్రగిరికి వచ్చెను. తిరుపతి కాళహస్తులను సేవించి యట నుండి గంచికిఁ దరలినాఁడు. కాంచీనగరమున నచ్యుతుఁడు మహార్తికి తులాపురుషదాన మొనరించెనట! కంచినుండి రాయలు శ్రీరంగమునకు వచ్చెను. అచ్యుతుఁ డిటనుండగాఁ

జోళరాజు విప్లవముచే నుద్రిక్తులై విద్యానగరమునకు గప్ప మెగుర వేసిన గిరాతపతులు గొందఱు "గుక్కుమిక్కునక" మరియాదలు జెల్లించిరి.

సలకము బెదతిరుమలయ్య యచ్యుతరాయలతో మనవిసేసినాఁడు: "మహారాజా! చోళచేరములు జాల నల్పరాజ్యములు. వారిని జయించుటకుఁ దమరే స్వయముగ నింత శ్రమ గైకొన నక్కఱలేదు. కనుక దమ రిచటనే యుండుటకై నా వేడికోలు. మీ యాశ్రితులము మేము జోళచేరములపై దూకి వారినిబట్టి తెత్తుము. తెచ్చి తమ పాదాక్రాంతులఁ జేయుదుము!"

ఈ మాట లచ్యుతునకు సమ్మతములే యైనవి. సలకము తిమ్మయ్య యచ్యుతరాయలకు బావమఱది. వర దాంబిక కత డన్నగావలెను. బంధువిశ్వాసముతోడను, దానును బ్రయాణములతో డస్సియుండుటవలనను జక్రవర్తి శ్రీరంగముననే నిలచినాఁడు. అచ్యుతుఁ డచటి విద్యావినోద ములలోఁ దేలియాడుచుండెను.

అచ్యుతరాయల సైన్యములు రాజధానిని విడచిన వెంటనే రామరాయలు మరియొక పన్నుగడ నెత్తెను. వేరొక గొంతసైన్యమును విట్టలదేవుని యాధిపత్యమున బాణరాజుల నడఁచుటకై బంపినాఁడు. చెఱియొక వైపునుండి దాకినచో రాజద్రోహులు బరస్పరము సహాయము గావించి కొన వీలుండదుగదా! అది రామరాయల రాజకీయ ప్రజ్ఞ!!

పెదతిరుమలయ్యయు విశ్వనాథుడును జేరదేశముపై నడచిరి. కొంత సైన్యమును విభాగించి తామ్రపర్ణిపై నిలిపినారు. ఎక్కువ తక్కువలను బూరించికొనుట కామెలఁకువ. చేర విజయనగర సైన్యములకుఁ బశ్చిమపర్వతప్రాంతములలో ఘోరయుద్ధము జరిగెను. ఆయోధనమునందు జేరరాజు బూర్తిగ నోడిపోయినాఁడు. ఆ వైపు బాణరాజులుగూడ విఠ్ఠలునకు సంపూర్తిగ వశులైపోయిరి. "చేర" రాజు "సాలఁగు"ని విజయనగర సైన్యములకు బట్టియిచ్చెను. వానిని గైకొని యిర్వురు సేనాధిపతులు శ్రీరంగమునకు వచ్చినారు. అటనుండి యందరును విద్యానగరముఁ జేరిరి. చేరరాజు దాను బాకీపడిన కప్పమంతయును గట్టివేసినాఁడు. సాలఁగు నతి ఘోరముగ శిక్షింపవలెనని సరదారు లనిరి. అచ్యుతరాయలు మహాప్రధాని రామరాయలవైపు జూచినాఁడు. అళియరాముఁడు జిఱునవ్వుతో సాలగుని క్షమింపవలెనని చక్రవర్తులకు సలహా నొసఁగెను. వాఁ డింతకుముందు బాకీయున్న కప్పమంతయును జెల్లించినాఁడు.

పాండ్యరాజన్యుఁడు మరల స్వరాజ్యమున బ్రతిష్ఠితుఁడయ్యెను. ఈ యుపకారమునకై పాండ్యాధీశ్వరుఁడు దన కుమారిత నచ్యుతరాయునికొసఁగెను. పాండ్యరా జచ్యుతునకు మామయైనాఁడు.

కొన్ని నెలలు సుఖముగ గడచినవి. ఇంతలో బిజాపురపు సులతానులనుండి కదలికవచ్చినది. వాఁడు రాయల రాజ్యము రాయచూరిపైఁ బడినాడు. దానిని సాధించుట

కెవరినైనను బంపవలెను. కాని బిజాపుర మొక్కటే యీ యుద్ధమును సాగించుచున్నదని నమ్మకమేమి? తెరవెనుక దక్కన నలుగురు సులతానుల ప్రోత్సాహమును నెందు కుండరాదు? వీరిలో గజపతిగూడ రహస్యముగ జేరినాఁడేమో? ఈ యాలోచనలతో రామరాయల కిదియుఁగూడ రాజద్రోహుల యొక్క పెద్దపన్నుగడగనే భాసించినది. అల్ప సైన్యములతో నడుపులోనికి వచ్చునదిగఁ దోచలేదు.

రామరాయలు దక్షిణమునుండి యనేక సేనలు రప్పించెను. అచ్యుత దేవరాయలనే సర్వసైన్యాధ్యక్షుఁడుగ నొనరించి బిజాపురముపైకి దరలించినాఁడు. అచ్యుతరాయలు విరోధులతోఁ బోరుచున్నపుడళియ రామరాయలు సామ్రాజ్యమును వేయికన్నులతో రక్షించుచుండెను. సామ్రాజ్యమునందు సర్వసైన్యాధీశుఁడుగ దన చిన్న తమ్ముఁడు వెంకటాద్రిని రామరాయలు నియోగించినాఁడు. పెద్ద తమ్ముఁడైన దిరుమలరాయఁడన్న రాజకార్యములందు సహాయమొసఁగుచుండెను. పరిస్థితులిట్లుండగనే దక్షిణమునందు మలబారు సామంతులు దిరుగఁబడిరి. రామరాయలే స్వయముగ దండెత్తి వారిని జయించివచ్చెను. ఆతఁడు రాజధాని విడిచిన యాఱు నెలలును, రాజధాని విడిచినట్లే యెవ్వరికిని దెలియదు. ఆ విషయగోపన మంత జక్కఁగ జేయఁబడెను.

అచ్యుత దేవరాయలు బిజాపుర సులతానుల క్రుళ్ళడగించి సపరివారముగ వెనుదిరిగివచ్చినాఁడు. ఆ తరువాత నాతఁడు రాజ్యము బాలించినది సుమారు బన్నెండు సంవత్స

రములు. విజయనగర చరిత్రయందచ్యుత దేవరాయలు గొప్ప యదృష్టవంతుడనఁబరఁగెను. విద్యానగరసింహాసన మున కాకాలమున బడమటి పొలిమేర గుల్బర్గా. ఉత్తర మున బెంగాలులోని "సాందీపము" గడిదేశము. దక్షిణమున మళయాళసింహళములును, దూర్పునసముద్రమును సీమలుగ నుండెడివి. పదునైదులక్షల కాల్బలము, నాలుగువేల మద గజములు. నలువదివేల ఘోట్టాణఘోటకములు బిలచిన బలుకుచుండెడివి. రాజ్యమంతట సస్యసమృద్ధియేగాక వజ్ర ముల పరిశోధనయు గనులనుండి బంగారు దీయుటయు విరివిగా సాగుచుండెను. గోవానుండి విజయనగరమున కాకాలమున బదునైదు దినముల ప్రయాణము. ఆ త్రోవ లన్నియు నెప్పుడును జనములచేత గ్రిక్కిరిసియుండెడివి. "ఇటలీ" నుండి వెలగలగుడ్డలు దిగుమతియగుచుండెను. రత్నములు, వజ్రములు విద్యానగరమునుండి యెగుమతి సర కులు. పర్షియాదేశమునుండి దిగుమతియగు హయములతో నాదాయపుబన్నే సంవత్సరమున కొకటిన్నరలక్ష నిష్క ములు సామ్రాజ్యమునకు లభించెడివట! వైభవమంతయు నచ్యుతరాయలకు సంపాదించిపెట్టినవాడు దేశభక్తిపూరి తుఁడును సత్యవచనుఁడగు నళియరామరాయలే. ఆ యన్న హృదయమే హృదయమె యాతనిచేతలే దమ చేతలె తమ్ములగు తిరుమలరాజును, వెంకటాద్రియు మెలఁగిరి. ఆ యన్నదమ్ముల పరస్పరానుకూల మెంత గొప్పది. వారి పరిపాలనాదక్షత, భుజబలము దుళువవంశాంకురమగు నచ్యుత

దేవరాయల సామ్రాజ్యమున వైభవములు రాల్చెను. ఆ యౌదార్యము జరిత్రయందే యొక యద్భుతమైన విషయము.

పునఃప్రతిష్ఠ :

కృష్ణరాయలవలెనే యచ్యుతుఁడుగూడఁ గవి పండిత పోషకుఁడు. సంగీతకళావిశారదుఁడు. సరసనాట్య సందర్భ వేత్త.

అచ్యుతరాయని యాస్థానమందే రాజనాథ డిండిము డుండెను. ఈ మహాకవి గీర్వాణభాషయం "దచ్యుతరాయా భ్యుదయ"మును రచించినాఁడు. అందు వర్ణింపబడినది సార్వభౌమ చరిత్రమే. అచ్యుత దేవుని యాస్థానమున వాసి గన్న గీర్వాణ కవయిత్రి దిరుమలాంబ. ఈమె వరదాం బికాపరిణయ" మను మహాకావ్యమును సంధానించినది. దానియందలి కథావస్తు వచ్యుతదేవరాయలకు, సలక రాజేంద్ర దుహితయైన వరదాంబకు నైన వివాహము. ఆ కావ్యము నామె యెంతయో చతురతతో నిర్వహించినది.

ప్రతివర్షము నచ్యుతుఁడు వెంకటేశ్వరునకు "గావ్య ప్రబంధ పుష్పాంజలి" నర్పించెడివాఁడట! అట్లు ... వేళలట నొక మహాకవిచే గావ్యమును వ్రా... వేంకటేశ్వరు నకు గృతినిచ్చుట. ... వైష్ణవుడగుట చేతనే గాక దా ననేకదినములు జంద్రగిరి... నుండినవాడగుటవల నను అచ్యుతదేవరాయలకు శ్రీ...సుఁడన్న గంపెడంత యభిమానము. విద్యానగర సార్వభౌముఁడగు నచ్యుత రాయని కొక బావమఱఁదియుండె...ని చెప్పితిమి గదా!

చోళరాజును జయించివచ్చిన తరువాత వాఁడు గొండవీటికి మరలిపోలేదు. విద్యానగరమందే కోశాధికారిగనుండి నాఁడు. అచ్యుతరాయని చరమదినములలో వాని హృదయ మందును సామ్రాజ్య మాక్రమింపవలెనను నొక దురూహ బయలుదేరినది. దాని నచ్యుతుఁడు గనిపెట్టనేలేదు. పైగా నచ్యుతుఁడు "బావమఱది" యన్న బంధుప్రీతితో వాని నింకను దగ్గఱకుఁ దీసినాఁడు. సలకము తిమ్మని దురూహ రామరాయ లెప్పుడో గ్రహించినాఁడు. వాని దుర్వర్తనము నడ్డగించుటకుఁ దగిన కట్టుదిట్టము లళియఁడు రహస్యముగ గావించుచుండెను.

సలకము తిమ్మయయుఁ దన ప్రయత్నములు దాను జేయుచునే యుండెను. తొట్టతొలుత వాఁడు రామరాయ లపై నేవేవో కొండెములు గల్పించి వరదాంబకుఁ జెప్ప మొదలువెట్టెను. కోశాగారము దనచేతనుండుటచే ధన మును దిక్కుమొక్కులేక ఖర్చుబెట్టి గొందరు సరదారులను దనవైపు లాగికొనినాడు. నాయకద్వయమున కిట్లు బోటీలు జరుగుచున్న సంధికాలముననే యచ్యుతదేవరాయలు మర ణించినాఁడు.

అచ్యుతరాయుల కాలమున నాతని సుతుఁడు చిన వెంకటాద్రి పెనుగొండయందుండెను. అతఁడు యువరాజై నను అచ్యుతరాయలు గుమారునకు రాజకీయము లర్థమగు టకై పెనుగొండకు వెంకటాద్రిని మండలేశ్వరుఁడుగ నొనర్చి యుండెను.

అచ్యుతరాయల మరణానంతరము వెంకటాద్రి విద్యానగరమునకు రప్పింపఁబడినాఁడు. అప్పటికే సలకము తిమ్మన దురూహ యంతఃపురమున బ్రసిద్ధమైయుండినది. అందువలన కృష్ణరాయల భార్యలిరువురును, వాని పన్నాగములాప సంకల్పించినారు. ఇక వరదాదేవి తమ్ముఁడైన సలకము తిమ్మని మార్గమునే ద్రొక్కినది. ఈ రీతిగ నంతఃపురమున రెండు పక్షములు చీలినవి.

చిన వెంకటాద్రి పట్టాభిషేకము ముగిసినది. అతనికి మహామంత్రి యెవరు గావలెనను సమస్య బయలుదేరినది. తిరుమలదేవియు జిన్నాదేవియు రామరాయలే కావలెనని పట్టుబట్టిరి. వరదరాజమ్మ సలకము తిమ్మరుసుగావలెననెను. పైగా సలకము తిమ్మయ్యకు వెంకటాద్రి మేనల్లుఁడు. అప్పటికిఁ గొందరు సరదారులును సలకము వాని వాలకమునే "సై" యన్నారు. ఈ యంగబలములతో వాఁడు బ్రధాని పట్టమందినాఁడు. అందుటయే దడవు వాఁడు దన దుశ్చర్యలకు మొదలువెట్టెను. రామరాయల నాశ్రయించియున్న వారి నొకరొకరిగా సలకము తిమ్మడు మట్టగింప మొదలుబెట్టెను. కోశాగారమునందలి ధనమునంతయు విచ్చలవిడిగ వెచ్చము సేయ నారంభించినాఁడు. ఈ నడుమకాలముననే వాఁడచ్యుతరాయల సోదరుఁడైన రంగరాయలను రహస్యముగ జంపించెను. ఆ రంగరాయని కుమారుఁడగు సదాశివరాయలను గుత్తిదుర్గమున "నేలమాళిగ"తో బంధించినాఁడు. కాని వానికి రామరాయలను బాహాటముగ నెదిరించుటకు

భయము. సామ్రాజ్యమున గలిగిన యీ మార్పులన్నియు రామరాయలు గమనించుచునే విద్యానగరసామ్రాజ్య క్షేమ చింతకుడై రాజధాని వీడిపోకుండెను. సలకము తిమ్మడు రహస్యముగ రామరాయలను జంపుటకు మార్గములు వెదకు చుండెను. ఇదిగూడ నళియనికి దెలియును.

వరదరాజమ్మకు సలకము తిమ్మనిపై విశ్వాసము చెడినది. కాని రామరాయలనుగూడ నామె నమ్ముటలేదు. సార్వభౌముడగు వెంకటాద్రినిగూడ సలకముతిమ్మడు బందీ వలెనే యుంచెను. వాని మాట కెదురు పల్కుటకు సార్వ భౌములకు హక్కులేదు. కోటలో వరదరాజమ్మస్థితి గూడ ఘోరముగనే యుండినది. ఈ స్థితులన్నియు నాలోచించి యామె సామ్రాజ్యమునకే యెసరువెట్టు వృత్తికి దిగినది. రహస్యముగ నామె బిజాపుర సుల్తానునకు సలకము తిమ్మని దుండగము నదలించి వెంకటాద్రికి సామ్రాజ్యము స్థిర మొన రింపవలెనని విన్నప మంపెను. ఆ సులతానట్లు జేసినచో వానికసంఖ్యమగు ధనమొసగునట్లును ఏటేట విద్యా నగరము గప్పము జెల్లించునట్లును వరదాంబిక యొడబడినది. బీజాపుర సులతానున కిం కేమిగావలెను? వాని రొట్టె విరిగి నేతిలో బడినటులైనది. ఆసద్ ఖాను సైన్యాధ్యక్షుని యాజ మాన్యమున వా డపార సేన నంపినాడు.

ఈ వార్త రామరాయలకు దెలిసినది. అతని కా వార్త విషముదిన్నటులుండెను. కాని యేమి సేయగలడు? వరదరాజమ్మకు దా నెట్లు విశ్వాసము గల్గింపగలడు?

ఆమె కెన్ని దినములనుండియో దనపైఁ గొండెములు గల్పించి చెప్పినారు. ఆ కపటసృష్టియంతయు దన యొకటి రెండు మాటలతోఁ బోవునా? కడపట్రమూనిపైకి వచ్చుచున్నాడు సులతాను. వాని నడ్డగించుటకు దన దగ్గర సైన్యమేదీ? సలకము తిమ్మఁడనుక్షణము దన ప్రాణముల కెక్కుపెట్టి నాఁడు. ఈ గద్దలములోఁ దన్నువాఁ డొంటిగ జిక్కించుకొని మట్టువెట్టడా? ఈ విషయములన్నియు నాలోచించి రామరాయలు సైన్యముల సమీకరించికొని త్వరగా రావలెనని రాజధానినుండి రహస్యముగఁ గదలెను. అతని వెంటనే యతని దోడునీడలైన తిరుమల వెంకటాద్రులుగూడ మాయమైనారు.

సలకము తిమ్మనికి బిజాపుర సుల్తాను వచ్చుచున్న వార్త దెలిసినది. వీని నెవరు బిలిపించిరి? సలకము తిమ్మయ వాకబు చేసినాఁడు. ఈ వర్తనమంతయుఁ దన చెల్లెలైన వరదరాజమ్మదని యెఱిఁగెను. అపుడు వరదరాజమ్మమూర్తి వాని కర్థమైనది.

ఇక వాని రాజ్యాశలు నిలుపుటకు గట్టులు లేకపోయినవి. ఈ చిన్న వెంకటాద్రి యున్నంతవరకు నెవరో యొకరిట్టే జేయుచుందురు. ఈ తుళువవంశమునే పెరికివేసినచో యిక దనమాట కడ్డులేదు. సలకము తిమ్మఁడు దుష్టభావములను ద్రాచుఁబిల్లలను దనయెదలోఁ బ్రోదిచేసికొనినాఁడు. సలకము తిమ్మఁడు బీజాపురపు నవాబును సగౌరవముగ మార్గమధ్యముననే యెదుర్కొనెను. విద్యానగరమునుండి

గొనిపోయిన యసంఖ్యములగు ధనపుసంచులు సుల్తాను పాద ములచెంత గలగల విదలించినాఁడు. అమూల్యములగు రతనము లాదిల్షాకుఁ గానుకగ నొసఁగి వెన్కకుఁ బోవలసి నదిగ బ్రతిమాలినాఁడు. పరిశ్రమలేకయే నిరవధిక ధనము వచ్చినది. ఆ ధనము ఆదిల్షాకుఁ జేదగునా యేమి? వాఁ డా రత్నములను బంగారును గ్రహించెను. ఈ విషమఘట్టము నందు విద్యానగర మెటులైనను దనచేతికి వచ్చుననియే వాఁడెఱుఁగును. రామరాజు రాజకీయ చాతుర్యముగూడ సులతానున కెఱుకయే. అందుచే నళియరాముఁడు మొద లైన వీరులనందరిని సలకము తిమ్మనిచేతనే మట్టుపెట్టింప వలెనని వాని యూహ. వాఁ డీ యాలోచనకుఁదగిన మాట లన్నియు సలకము తిమ్మని కెక్కులు వెట్టినాఁడు. వాని బలగమంతయును బోయినవెనుక సలకము తిమ్మయ్య దన చేత దొఱుకక యెక్కడఁబోవును? ఇన్ని యూహాలు మన సులో నుంచికొన్న యాదిల్షా బోయివత్తునని సలకము తిమ్మని కనినాఁడు. ఆ మాటలకు మరలఁ ద్వరలో వత్తునని వ్యతిరేకధ్వని.

సులతానును వెనుకకుఁబంపి యేమియు దెలియనట్లు సలకము తిమ్మరాజు విద్యానగరము బ్రవేశించెను. తరువాత మూఁడు నాలుగు రోజులకే విద్యానగర చక్రవర్తి చిన వెంకటాద్రి మాయమైనాఁడు. వానిని సలకము తిమ్మయ గొంతుబిసికి చంపెను. ఈ విషయము మార్కాపురము చెన్నకేశవాలయ గరుడమంటపమునందు శిలాక్షరములందు

శాశ్వతముగ ముద్రింపఁబడియున్నది. వెంటనే సలకము తిమ్మయ్య వరదరాజమ్మను గారయందుంచినాఁడు. ఆనాటి నుండి వాఁడు విద్యానగర చక్రవర్తినని ప్రకటించికొనెను. వాని యుద్ధతిని రాజబంధువులు గొన్నాళ్ళు సహించినారు. కాని వీరి సహనము వాని దుర్మార్గమునే రెచ్చగొట్టినది. వాని యుత్పథములకు మేరయే లేకుండెను. అందుచేఁ గొందరు సరదారులు వానిని సింహాసనమునుండి దప్పించుటకు గుట్రలు బన్న నారంభించిరి. వానికిఁగూడ వేయి గన్నులున్నవి. ఈ ప్రయత్నములు వాఁడు దెలిసి దానికి గారకులైన సరదార్లను గారణాంతరములతో దనకడకు రప్పించి వచ్చినదే తడవు గొంతమందికి గ్రుడ్లు బీకించెను. కొంత మందిని ఘోరముగ జంపించినాఁడు. కొంద రీ దురూహల నెరిఁగి వానియెదుటనే బడకుండిరి. మఱికొందఱు సామంతులు రాజధానికే రాక దమ తమ మండలములందే స్వతంత్రులై గూరుచున్నారు.

ఈ మహావిషమస్థితిని గమనించి సామ్రాజ్యక్షేమ చింతకులు అనూచానముగ రాజవంశమును గొలుచు రాజభక్తులు రామరాయలకు వెంటనే వచ్చి సింహాసన మాక్రమించికొనవలెనని వార్త బుత్తెంచిరి. లేకున్న సామ్రాజ్యము చెడి చెటాకులై పోవుననియు మనవి బంపినారు. ఈ వార్త జేరుటకు ముందే యళియరాముఁడు బెనుగొండయు, నాదవేనియు స్వాధీనపరచికొని యుండెను.

విద్యానగరమునుండి సరదారుల మనవి వచ్చిన వెంటనే రామరాయలు గుత్తిపైకి దాడి సలిపినాడు. "జగతాపి" దుర్గమున నేలమాళిగలో సదాశివరాయలు గ్రుళ్ళికుములుచున్నాఁడని యళియఁ దెలుఁగును. చిన్న వెంకటాద్రి యనంతరము సామ్రాజ్యమునకు రావలసిన వారసుఁడతఁడే. దాడిసలిపినదే తడవు గుత్తిదుర్గము రామరాయల చేతికిఁ దక్కినది. సలకము తిమ్మని పాలనముతో విసిగిన రాజభృత్యులు అడిగిన వెంటనే కోటబీగము చెవు లాతనికిచ్చిరి. ఆ యంధకారములలో మనసు చీకటులలోఁ గుములుచున్న సదాశివుఁడు మఱుక్షణమే యళియరాముని కౌగిలియందున్నాఁడు. "నిత్యసత్యవచనుఁడగు" రామరాయలు సదాశివునే సామ్రాజ్యమునకుఁ జక్రవర్తిగ ప్రకటించి వాని శిరస్సున బంగారు కిరీటముంచినాఁడు. సదాశివుని చక్రవర్తిగ ప్రకటించిన వార్త యూరూరికి సుడిగాలివలె ప్రాకినది. మనోవేగముకన్నను మిన్నయగు వేగముతోఁ బ్రాకినది. విద్యానగరపు సామంతులలో ననేకు లనేక విధములుగ నైనారు. చిరంతనముగ స్వామిభక్తిగల సామంతులు మరల హైందవ ధర్మపీఠము నెలకొన్నదని సంతోషపడినారు. సలకము తిమ్మని వేధలతో విసిగినవారు వాని చావుకాలము దగ్గరైనని తృప్తితో నిట్టూర్పు వదలినారు. నడుమంత్రపుసిరితో స్వతంత్రులైన సామంతులు వారిగుండెలే దప్పెటలై వారికి వారి నాశము జాటినవి. రామరాయ

**లల్ప పరివారముతో భయపడక విద్యానగరమునకు దాడి సలిపెను.**

త్రోవపొడుగున సైన్యములతో సరదారు లాతనితోఁ జేరినారు. తొలుతఁ బిల్లకాల్వగనున్న రాముని సైన్యము నడచుకొలది మహాసముద్రమగుచుండెను.

రామరాయలు వచ్చుచున్న వార్త దెలిసిన వెంటనే సలకము తిమ్మనికి మృత్యువు నెత్తిపై నాడినట్లైనది. వాఁడు వెంటనే బీజాపురమునకు వర్తమాన మంపినాఁడు. ఆదిల్షాకీవిషయము ముందే దెలియును. కాని రాముడన్నంతనే వానికి భయము. అయినను సలకము తిమ్మనివలన గొంత ధనమైనను రాబట్టుకొనవచ్చునని వానియాస. ఈ యూహలతో వాఁడు బీజాపురమునుండి గదలినాఁడు. వాఁడు విద్యానగరమునకు వచ్చువేళకుఁ గోదండరాముని సైన్యము లింకను రాజధానిని దరిసినవిగావు. ఇది సులతానునకైన యొక శుభశకునము.

సలకము తిమ్మయ్య యిబ్రహీం ఆదిల్షా కెదురువచ్చి మహోత్సవముతో రాజధానిలోనికి దీసికొనిపోయినాఁడు. నవరత్నఖచితమై హైందవ ధర్మస్వరూపమైన హొయసల సింహాసనముపై సలకము తిమ్మఁడు సుల్తానును గూరుచుండ బెట్టెను. బీజాపురపు సుల్తానే విజయనగర చక్రవర్తి యని సలకము తిమ్మఁడు వీరావేశమున బ్రకటించినాఁడు. సకలములగు హంగులతో సులతానునకు విద్యానగరసింహాసనముపై బట్టాభిషేకమే జరిగినట్లయ్యెను. అప్పటి వేడుక లేదు

దినములు. తిమ్మరాజు రాజధానిలో మిన్ను మన్ను బగుల జేయించినాఁడు. తాను బిజాపురపు సులతానునకు సామంతుడ ననియుఁ బ్రకటించెను.

ఇంతలో రామరాయల సైన్యములు విజయనగరపు గోట దన్ని నిలచెను. కాని రాజధానియందు బ్రహ్మాండమగు బీజాపురపు సైన్యము లున్నవి. వానికిఁదోడు సలకము తిమ్మయ్య యనీకిని యున్నది. ఈ రెండును జేరి యసంఖ్య మగును. తన సైన్యము ఎదిరి సైన్యముతోఁ బోల్చినపుడు జాల యల్పతి. తనకు జయము సంశయముగ నళియనికిఁ దోచినది. అతఁడు రాజకీయములు కృష్ణరాయలు, సాళ్వ తిమ్మరుసు - వీరిదగ్గరఁ జదివినాఁడు. అళియరాముఁ డొక యుపాయమును బన్నెను. అతఁడు రహస్యముగ సలకము తిమ్మని కొక జాబు వ్రాసి పంపినాఁడు. అది యిది. "శ్రీమ న్మహారాజాధిరాజ రాజపరమేశ్వర, మూరురాయరగండ" సోమవంశనృపాల విద్యానగర వజ్రసింహాసనాసీనులగు సలకము దిమ్మయదేవ మహారాయల దివ్యసన్నిధికి - తమ దాసుఁడు రామరాయలు గావించు విన్నపము. నేను సర్వ విధముల మీ వృద్ధియ కోరుచున్నాను. నే నీవర కాచరించిన పని కెంతో పశ్చాత్తాప పడితిని. సదాశివరాయలనుబట్టి హతమార్చెదను. మీ కుత్తమ గతులనే భావియందుఁ దందిం తును. వెంటనే బీజాపురపు సులతానును వెన్కకంపుడు.

విద్యానగర రత్నసింహాసనము మీకే దక్కును. మీకు మేమందఱు వశవర్తులై వర్తింతుము.

రామరాయలు"

ఈ జాబుఁజూచినంతనే సలకము తిమ్మయ్య మనసులో మరల బిల్లపాము బారాడినది. వాఁడేమి మాటలు గల్పించి చెప్పెనో! బీజాపురపు నబాబు వెనుకకు మరలెను. సులతానుకుఁ దిమ్మయ్య యాఱులక్షల దీనారములిచ్చినాఁడు. వారు విద్యానగరమునం దున్నంత కాలము దినమునకు మూఁడు లక్షల దీనారములవంతున గట్టించెను. ఇంకను వెలగలుగు మగరాలను వజ్రములను గంపలతో నిచ్చినాఁడు. బంగారును అనర్ఘములగు బట్టలను ఎంతయో, యెన్నియో యుపాయన మొసఁగెను.

బిజాపురపు సులతాను గోట దాటి పోవునంతవఱకు రామరాయలు దిమ్మనియెడ వినయమునే నటించినాఁడు. మహమ్మదీయుల సైన్యములు విద్యానగర సరిహద్దులు గడచి వెళ్ళినవి. ఇక రామరాయలు విజృంభించెను.

అరవీటి సైన్యములు హుంకరించి విద్యానగరముపైఁ బడెను. లోనున్న కృష్ణరాయల దేవేరులు రామరాయలకు రహస్యముగ గోటవాకిండ్లు దెరచినారు. సలకము తిమ్మనికి మతిపోయినది. వాఁడు గనపడిన యేనుగుల కన్నిటికిఁ గన్నులు బొడిపించెను. గుఱ్ఱములకు దోకలు గత్తరించినాఁడు. అనర్ఘములగు వజ్రములను రతనములను దిరుగళ్ళ

లోవేసి త్రిప్పించి యాపొడిని వీథులలో జల్లించెను. ముత్తెములు బచ్చలు గెంపులు మొదలగువానిని వీథులయందు విచ్చలవిడిగఁ జల్లించినాఁడు. తనకు లేని సంపద మఱెవ్వరనుభవింపగూడదని వాని యూహ. కట్టకడకుఁ దన గదియందు స్తంభమునకు ఖడ్గమొక దానిని సంధించి దాని మొన దన వక్షమున దాకి వెనుకవీపున వెడలునంతటి రభసముగఁ బొడిచికొనెను. ఆ పాపాత్ముఁడు రామరాయాదులు నగరు సొచ్చునంతలోననే యింత పని జేసినాఁడు.

విద్యానగరమును బ్రవేశించిన రామరాజు రెండు దినములు విశ్రాంతి గైకొని మహోజ్జ్వలముగ సదాశివునకుఁ బట్టాభిషేకము నెఱవేర్చినాఁడు. "జీర్ణకర్ణాటలక్ష్మి పునస్సృష్టి యొనర్చిన "త్యాగి" యన విద్యానగర ప్రజ యాతనిని బొగడెను. సలకము తిమ్మని బరిమార్చి సామ్రాజ్యము నుద్ధరించినందులకు స్వర్గమున విద్యాధరులే వీణెలెత్తి శృతి గూర్చి వాయించుచు నుతించినట్లు 'మంగళం పాడు' శాసనమునం దున్నది. కృష్ణరాయల కొసఁగిన మాట నిల్పి కొన్న యళియరా[illegible]ప్రతిజ్ఞుఁడు, నిరుపమ విక్రముఁడు, నిష్పా[illegible]యోగ.

---

